నవ్వింది; సందర్భానుసారంగా, అర్థయుక్తంగా. ఆ పా
లోని అంతర్యం తెలిసి అందరూ నవ్వుకున్నారు.

అదంతా ఓ సుందర దృశ్యం.

శారీరక అశక్తతలో చ
స్వయంగా రాయలేక, క్రిష్ణారావు చేత రాయించిన ఈ ప్రే
గీతాల్ని ప్రతి ఉదయం సారిస్‌కి చదివి వినిపించేవా
అవసరమైన చోట్ల ఆమె వాటిని సవరించే వారు.

ఈ గీతాలలో వర్ణించినట్లే పు
చెట్లని, పిట్టల్ని, నీలాకాశాన్ని, లేఎండని, కలువ లో
చూస్తో రంగు రంగుల వాజుల్లో రక రకాల పువ్వుల్ని
అమరుస్తో, టాగూరు "కావ్య" కవితా మాధుర్యాన్ని,
అందాలని, సంగీతాలని, సౌందర్యాలని, వర్ణించి చెప్పేవా
సారిస్.

ఒక్కొక్క గీతం క్రిష్ణారావు చ
వాక చలం, సారిస్ ఆ భావ సౌందర్యానికి, మనోహర
గానానికి, అనంత మాధుర్యానికి, తాత్విక గాంభీర్యానికి,
ముగ్ధులై వాటినే తిరిగి తిరిగి పారవశ్యంతో తలుచుకుంటో
హృదయ నిశ్శబ్దంలో "మ్యూజ్" చేసుకుంటో తన్మయులై
భగవాన్ శ్రీ రమణ మహర్షి ఎదుట మౌనంగా కూర్చుం
పోయేవారు. ఆ రోజులు అందంగా, ఆనందంగా గడిచేవి.

ఈ గీతాలలో పల్లెల సౌందర్యం,
మల్లెల సౌరభం, సెలయేళ్ళు, నీలాటి రేవులు, కొ

సేపులు, గొల్ల పదుచులు, జోల పాటలు, చల్ల చిలికే చప్పుడులు, పాలు పితకడాలు, రాట్నం తిప్పే ముసలమ్మ రాగాలు, పడుచు వాళ్ళ పేరింతలు, బిల్లకట్లు, సంజ వెలుగులు, పావురాల మూలుగులు, గోధూళి, చిక్క పడుతున్న నీడలు, గానంతో పులకరించే దక్షిణ మారుతాలు, వర్ష మేఘాలు, మిణుగురులు, వసంత కుసుమాలు, పైడి పచ్చల రవళులు, మేలిముసుగులు, పరిణయ తల్పాలు, పాడే పావడాలు, కంపిత పత్రాలు, పంట పొలాలు, ఎగిరే పక్షులు, గంతులేస్తోన్న మేక పిల్లలు-సహజ సౌందర్యంతో రమణీయంగా వున్నాయి.

ఈ గీతాలలో సమస్తసౌందర్యాల్ని, నిత్య సత్యాల్ని అద్భుతంగా చిత్రించారు టాగూరు.

సౌందర్యోపాసకుడు అయిన చలంలోంచి సహజంగా, స్వచ్ఛంగా పలికాయి అనువాదాలు. అందుచేత ఈ గీతాలు చదువుతోంటే టాగూర్ బెంగాల్ని వర్ణించినట్లు స్ఫురించదు: చలం ఆంధ్రదేశాన్ని వర్ణించి నట్లు అనిపిస్తుంది. ఆ నేల, వాసన, అందం, వర్ణన అంతా తెలుగుదేశం, తెలుగుతనం___

టాగూరు ఎంత సహజంగా రాశారో అంతకన్న సహజంగా, అందంగా, అనువాదం జరగడంతో ఈ గీతాలు చలం సొంత మనిపిస్తాయి_

“ఈ అనువాదాలు శాప చే
రాయకపోవడం పెద్ద లోపం అనుకుంటాడు వాన్స్. కా
అట్లా డిక్టేట్ చెయ్యడం వలన వాటికి గొప్ప అం
పట్టింది - మిల్టన్ డిక్టేట్ చేసినట్లనిపిస్తుంది. అలా చెప్పడం
వాటికి గొప్ప సౌందర్యం, బరువు, లోతు, వూపు, విశాల
లయ, సౌకుమార్యం, సహజత్వం వొచ్చాయి.

ఇవి అనువాదం అనిపించక పో
డమే వీటిలోని అందం అంటారు “వాన్స్” గురించి
ముచ్చటిస్తో - సారిస్.

# కానుక

నీ రాజ్యాధికారాన్ని మాయం
నిచ్చావు, షాజహాన్. ఒక ప్రణయాశ్రువుని అవినాశనం
చెయ్యాలని నీ కోర్క.

మానవ హృదయంపై కాలానికి
దయా లేదు. జ్ఞాపకం ఉంచుకోవాలనే విచార కరమైన
ని యత్నాన్ని చూసి నవ్వుతుంది కాలం.

నువ్వు కాలాన్ని సౌందర్యంతో మరి
పి బంధించావు. మాసిపోని ఆకారంతో నిరాకారుడైన
మృత్యువుని కిరీటధారిని చేశావు.

రాత్రి నిశ్శబ్దంతో, నీ ప్రేయసి
చెవిలో పలికిన రహస్యాన్ని, శాశ్వత పాషాణ మౌనంలో
హొందించావు.

సామ్రాజ్యాలు పొడి పొడి అయి
గినా, యుగాలు నీడల్లో మాయమైనా, చలువరాయి
త్రం ఈనాటికీ నాకు జ్ఞాపకమేనని నిట్టూరుస్తోంది.

నాకు జ్ఞాపకం వుంది. కాని జీవితం
చిపోతుంది. ఎందుకంటె అంతరహితమైన దాని నించి

ఆమెకి పిలుపు వొచ్చింది. ఏ భారాన్నీ అంగీకరించకండా, తన యాత్ర నిసాస్తుంది; ఒంటరివై పోయిన సుందర రూపాలకి తన జ్ఞాపకాన్ని వొదిలి.

2.

ప్రియా, నా తోట దాటలోకి రా!

నీ దృష్టిలో పడాలని తాపంతో తొక్కిసలాడే పూల పక్కనించి నడిచి ముందుకి వెళ్లు.

వెలుగులో ముంచుతో కూడా, అందర తప్పించుకునే సూర్యాస్తమయ అపురూప శోభన్ని తళుక్కుమని మెరిసే ఆనందం దగ్గర ఆగు.

ప్రేమార్పణ అతి సుకుమారం. తన పేరు చెప్పుకోదు. దుమ్ములో హర్ష కంపనను వొదులుతో నీడ పైన మృదువుగా తేలి పోతుంది.

దాన్ని వేగంగా స్వీకరించలేక పోయినావా, అది ఎన్నటికీ దొరకదు.

కాని నువ్వు స్వీకరించి నిలుపుకో గల కాస్త మృదువైన పుష్పం, మిణుకుమంటో ఆరిపోయే జ్వాలా దీపం.

3.

నా తోటలోకి పక్షు గుంపులు, గుంపులుగా వొచ్చి పడతాయి. ఒకదాన్ని వొకటి తోసు కుంటాయి. అవి సంపూర్ణత చెందాలనే వేదనతో కాంతిలో పొంగి పడతాయి.

9

రాణీ, నా తోటలో గొప్పగా నీ
ను మోపు. నీడలో కూచుని తొడిమల నించి పళ్ళని
పనీ, వాటి మాధుర్య భారాన్ని చివరి బొట్టు వరకు,
పెదిమలవద్ద అర్పించుకోనీ.

నా తోటలో, సీతాచిలకలు ఎండలో
క్కలు విదిలిస్తాయి. ఆకులు కంపిస్తాయి. పూర్ణత చెంద
నికి పళ్ళు గోల పెడతాయి.

గడ్డిపువ్వు భూమికి దగ్గరైనట్టు
మె నా హృదయానికి చేరువ. అలసిన దేహానికి నిద్రలాగ
త మధురం ఆమె నాకు. లోతైన శాంతిలో పుష్కలంగా
క్ కాలపు వరదలతో ప్రవహించే నదిమల్లే పొంగి పొరలే
తమే ఆమెపై, నా ప్రేమ. తన తరంగాలతో ప్రవా
తో గానంచేసే కొండవాగు గలగలమల్లే నా పాటలు
ప్రేమతో ఐక్యమైనాయి.

5. నక్షత్రాలన్నింటితోటీ ఆకాశమూ
అంతులేని ఐశ్వర్యాలతో ప్రపంచమూ, అన్నీ నాకు వున్నా
ఇంకా కావాలని అడుగుతాను. ఈ భూమిలో మరీ చిన్న
మూల కాస్త స్థలం వుంటే చాలు ఆమె నాదైతే.

6. ఏ మాత్రం లోభంలేని ఈ వసంత
న శోభలో, నా కవీ, జాగుచేస్తో కూచోక ముందుకు వెళ్ళే
వాహ, నవ్వుతో, పరిగెత్తుతో, తిరిగి వెనక్కి చూడనివారూ,
గౌరవం లేకుండానే ఓ గంట ఉల్లాసంగా వికసించి ఓ నిమి

షంలో ఏ పరితాపమూ లేకుండా మాయమయే వాటి సంగతి పోదు.

గతించిన నీ దుఃఖాశ్రువుల, హర్షమోదాల జపమాలని తిప్పుతో, నిశ్శబ్దంగా కూచోకు. గచిన రాత్రి రాలిన పూరేకుల్ని ఏరుకోడానికి ఆగకు. అందని వాటికోసం వెతుకుతూ, స్పష్టం కాని వాటి అర్థాన్ని తెలుసుకోవాలని చూస్తో సాగిపోకు. నీ జీవితంలోని రసహీనమైన భాగాల్ని ఎక్కడ వుంటే అక్కడే వాటిని వొదిలెయ్యి; వాటి లోతుల్లోంచి గాంధర్వానుభవం పైకి పొంగేందుకు.

7

ఇప్పుడు మిగిలింది కొంచెమే. తక్కిందంతా, ఏ లక్ష్యంలేని ఓ ఎండాకాలపు ఘడియల్లో వ్యయమై పోయింది. ఓ పాటగా అల్లి, నీకు పాడడానికి అంతే మిగిలింది. పూలు దండగా కట్టి మృదువుగా నీ చేతుల్ని పట్టుకుని తొడగడానికి; ఎర్రని గుండ్రని ముత్యంతో సిగ్గుపడే రహస్యంవలె నీ చెవిని అలంకరించడానికి, ఓ సాయంకాలం; ఓ ఆటలో పందెం పూర్తిగా వోడిపోవడానికి చాలినంతే మిగిలి పోయింది.

నా దోనె చాలా చిన్నది నాజూకయింది. వానలో పెద్ద అలల్ని దాటిపోవడానికి తగింది కాదు. నువ్వు దానిలోకి తేలికగా అడుగు పెట్టావా, నిన్ను నెమ్మదిగా అవతలి తీరపు రక్షణలోకి తీసుకు పోతాను; అక్కడ నల్లని నీళ్ళ తరగలు కలల కలత నిద్రల్లే వుంటాయి. అక్కడ నీటి మీదికి వొంగే కొమ్మల కింద

...వి, మూలిగే గువ్వలు, మధ్యాహ్నపు నీడల్ని, యాచ
...ల్ని చేస్తాయి. దినమంతా గడిచిన తరవాత, నువ్వు అలసి
...యిన నప్పుడు తడిసిన కలవను నీ జుట్టులో అమర్చి, కలవ
...వుతుంటాను.

నీకూ చోటు వుంది. కాసిని వరి
...కులు పట్టుకుని నుంచుని వున్నావు. నా పడవ నిండి
...యింది. దానినిండా బరువులు నింపారు. కాని నిన్నెట్లా
...కరించి పంపెయ్యను.

నీ లేత శరీరం సన్నగా, ఊగి
...తోంది. నీ కనుకొలుకుల్లో వుండుండి మెరుస్తోంది చిరు
...వ్వు. వానమబ్బులా వుంది నీ చీర రంగు.

ప్రయాణీకులు వారివారి రేవుల
...గ్గిర వారివారి యిళ్ళకి దిగిపోతారు. నా పడవకి ముందుగా,
...సేపు కూచుంటావు. నువ్వు దిగి పోవాల్సినప్పుడు నిన్ను
...అంకపరిచే వారెవరూ వుండరు.

నువ్వు ఎక్కడికి వెళతావు? నీ
...ని కంకుల్ని ఎక్కడ పాతర వెయ్యడానికి ఏ ఇంటికి వెళ
...తావు? అని నిన్ను ప్రశ్నించను. నేను తెరచాపలు దింపి
...పడవని కట్టేసినప్పుడు, సాయంత్రం కూచుని, నువ్వు
...క్కడికి వెళతావో, ఏ ఇంట కంకుల్ని పాతర వేస్తావోనని
...లోచిస్తాను.

9.

అలనా, నీ గంప బరువుగా వుం
నీ దేహం అలసి పోయింది. ఏ దూరానికి ఏ బా
కాంక్షతో బైలుదేరావు?

తెరువు దీర్ఘంగా వుంది. ఎం
దుమ్ము వేడిగా వుంది.

చూడు, కోనేరు లోతుగా నిం
వుంది. కాకి కన్నుమల్లె నీళ్ళు నల్లగా వున్నాయి. గట్లు
పచ్చికతో మృదువుగా ఏటవాలుగా జారి పోతున్నాయి.

అలిసిన నీ పాదాల్ని నీళ్ళ
ముంచుకో. మధ్యాన్నపు పవనుడు తన వేళ్ళతో నీ జుట్టు
నిమురుతాడు. పావురాలు తమ నిద్రపాటల్ని జోలగా పా
తాయి. నీడల్లో దాక్కునే రహస్యాల్ని చెట్ల ఆకులు
గుసగుసలుగా పలుకుతాయి.

కాలం గడిచిపోయి, సూర్యా
స్తమయమైతేనేం? సద్దు మణిగే సంజ వెలుగులో తోవ
పడకపోతేనేం?

పుష్పించే గోరింట కంచె వెనక
కనబడుతోందే, అదే నా ఇల్లు. నీకు తోవ చూపిస్తాను. నీకు
ఓ పక్క వేసి, దీపం వెలిగిస్తాను.

ఉదయాన ఆవుల పాలు పితికే
చప్పుడికి పిట్టలు నిద్ర లేచినప్పుడు, నేను నిన్ను నిద్ర లే
తాను.

10

కనపడని మార్గాల సంచరించే
మధుపాలు, ఏ శక్తి వాటి నిలయాల నించి లాక్కుపోతోంది!

లో ఎగిరే రెక్కలలో ఆ పిలుపేమిటి? విరుల ఆత్మలలో
...నే గానాన్ని అవి ఎట్లా వినగలుగుతాయి? నిశ్శబ్దంగా
...నే తేనె గదులలోకి అవి ఎట్లా దారిని తెలుసు
...తాయి?

11. సముద్రం నించి తోటలోకి వొచ్చిన
...లో చెట్లు తొడిగిన నునులేత ఆకు మొగ్గలు, దక్షిణ
...తంలో ఆకుల కదలికలూ, గలగలలూ మాత్రమే.
...టి సోమరి కూనిరాగాలు అంతే, వీటిలో ముగిసింది ఆ
...ం.

కాని కదలి వొంచన వున్న తోటలో
...మే వేసవిలో ప్రేమ పుష్పించాలి.

నాలో హర్షం వుద్భవించి చప్పట్లు
..., పొంగివచ్చే పాటలతో నృత్యంచేసి మధురమైన
...యంతో వుదయాన్ని కళ్ళు తెరిచేట్టు చెయ్యనీ.

12. ఎంతో కాలం కిందట ఓవసంతమా,
...లు నందన వన దక్షిణ ద్వారం తెరిచి అపనీతల
ప్రథమ యవ్వనంలోకి దిగినప్పుడు, స్త్రీ పురుషులు ఉన్మా
...లో నవ్వుతో, నృత్యం చేస్తో, ఒకరిపై ఒకరు పూరజం
...కంతో ఇళ్ళనించి బైటికి పరిగెత్తుకు వొచ్చారు

ఆ చైత్రం మొదట్లో, నువ్వు నీ
...లో వెదజల్లిన ప్రసూనాల్నే ఏడాది తర్వాత ఏడాది
...కొచ్చి ప్రసాదిస్తున్నావు అందుకే అంతటా అల్లుకున్న

వాటి పరిమళాలంతో అప్పుడు కలలైపోయిన దినాల స్మృతుల్ని అవి మాపై చల్లుతాయి. మాయమైన లోకాం దిగబడి పోయిన విరహ భారాల్ని, మనుష్య భాష [illegible] మానిపోయిన ప్రేమ కథలతో నీ మృదు మారుతాలు నిండి వున్నాయి.

ప్రథమ ప్రణయంలో పొంగిపోవ నా జీవితంలోకి నువ్వు అద్భుతంగా ప్రవేశించావు, ఓ నాథా. మొదటి ఆకు పచ్చని నిమ్మ మొగ్గలలో దాక్కున్న [illegible]మైన సంతోషం ప్రతి సంవత్సరం ఆనాటినుంచి నన్ను చేరవొస్తోంది. నేను విశదం చెయ్యలేనిదంతా నీ ఎర్రగులాబి పూలు, వాటి మండే మౌనంలో భరిస్తున్నాయి. ఆ [illegible] దినాల కవితా భావాల జ్ఞాపకాలు తిరిగి తిరిగి జన్మించే నీ కొత్త లేచిగుళ్ళ కంపనలో ధ్వనిస్తాయి.

13. ఉద్యాన వనంలో నిన్న రాత్రి పొంగి పొరలే నా యవ్వన మధువును నీకు అర్పించాను ఆ మధుపాత్రని, నువ్వు నీ పెదవులదగ్గిరికి తీసుకొని నీ కళ్ళని మూసుకుని చిరునవ్వునవ్వావు. నేను నీ ముసుగును తొలగించి, నీ వుంగరాల జుట్టు ముడివిప్పి, మౌనంతో, మధురమైన నీ ముఖాన్ని నా రొమ్ము మీదికి లాక్కున్నాను. నిద్రలో మునిగిన ప్రపంచాన్ని చంద్రుడు తన కలలో ముంచెత్తిన గత నిశీథంలో.

ఇవాళ శిశిర శీతల ఉషా నిశ్శబ్దంలో స్నాతనై, తెల్లని చీర కట్టుకుని, చేతుల్లో పూల సజ్జతో

స్వ ఉత్సవాలయానికి వెడుతున్నావు: ఉషా నీరవంలో
వారంలేని బాటమీద, చెట్టునీడలో నేను వొదిగి
కున్నాను.

14. ఇవాళనేను ఆతురతపడుతోవుంటే
యూ, నన్ను క్షమించు.

ఎండాకాలపు మొదటివాన యివాళ
పక్కన అడివి రెపరెప లాడుతోంది. పుష్పించిన కదంబ
కొలు మధు పాత్రలని పరిమళంతో నింపి తోవన పోయే
వాళ్ళి ఆశ పెడుతున్నాయి. చూడు, ఆకాశం అన్ని
టాల నించి మెరుపులు, తీక్షణ వీక్షణాల్ని విసురు
న్నాయి. నీ జుట్టులో పవనం అల్లరి చేస్తోంది.

ఇవాళ నేను నన్నునీకుసమర్పించు
కోవానికి వొస్తే, ప్రియా, క్షమించు. సాధారణ ప్రపంచం,
న మసకలో మరుగుపడ్డది. పల్లెలో ఎవరూ పని చెయ్యటం
ను. బయళ్ళు నిర్జనంగా వున్నాయి. వర్షాగమనం, నీ నల్లని
క్కలో గానంగా రూపొందుతోంది. నీలి పమిటను ముసు
గుకున్న నీ శిరోజాలకోసం ఆషాఢం, మల్లెపూలతో నీ
ద్వారంవద్ద వేచివుంది.

15. పల్లెలో యిరుగు పొరుగు వాళ్ళు
ఆమె నల్లగా వుంటుందంటారు. కాని ఆమె నా హృదయా
కి కలవ పువ్వు, అవును కలవే. తెల్లగాలేకపోయినా కలవ
పువ్వే నాకు. ఆమెని నేను పొలాల మధ్య చూసినప్పుడు
మబ్బు ముసుకు వేసుకొచ్చింది వెలుగు. ఆమె తలపై పమిట

ముసుకు లేదు. ఆమె అల్లుకున్న జడ మెడ మీద పొడుగ్గా వేళ్ళాడుతోంది. పల్లెలో అనుకునేట్లు ఆమె నల్లగానే వుండవచ్చు. కాని నేను ఆమె నల్లని కళ్ళని చూసి సంతోషించాను.

గాలిలో స్పందనం తుఫాను సూచిస్తోంది. చెదిరిన మచ్చల ఆవు అరుపు విని ఆమె యింటిలోకి పరిగెత్తింది. ఆమె విశాల నేత్రాల్ని ఓ క్షణం మబ్బులకేసి ఎత్తి; వొస్తున్న వాన చలనాన్ని తెలుసుకుంటు వరిపొలం పంచన నేను నుంచున్నాను. ఆమె నన్ను చూసి వుంటే, ఆ సంగతి ఆమెకే తెలియాలి.

ఎండాకాలపు వాన జల్లు సందేశం వలె ఆమె నల్లనిది. పుష్పించే అరణ్య భూముల ఛాయ మల్లె శ్యామలమయింది. వైశాఖ మాసపు కలవరపు రాత్రిలో అర్థంలేని ప్రేమవైన కోర్కెమల్లె నల్లగా వుంటుంది

16.

ఇక్కడ ఈ శిథిలమైన కోవెల రేవు మెట్ల దగ్గిర ఆమె నివసించేది. ఎన్నో సాయంత్రాల వెదురు ఆకుల మధ్య మత్తుగా వూగుతున్న చంద్రుడి వంక చూస్తో వుండేది. ఎన్నో వానరోజులు, వానలో తడిసిన నేల పరిమళం లేత వరి మొక్కల మీదిగా ఆమెను చేరవచ్చేది.

ఆ ఖర్జూర తోపుల మధ్య ఆమె ముద్దుపేరు అందరికీ తెలుసు.

చలికాలపు బొంతలు కుట్టుకుంటో కన్యలు కూచుని మాట్లాడుకునే ముంగిళ్ళలో కూడా ఆమె పేరు తెలుసు.

ఆ కొలను తన నీటిలో ఈత కొట్టిన
మె దేహాన్ని తన లోతుల్లో జ్ఞాపకం వుంచుకుంది. తడిసిన
మె పాదాలు ప్రతిరోజూ పల్లెకి పోయే తోవపైన గుర్తుల్ని
దిలాయి.

నీళ్ళకి తమ బిందెల్ని పట్టుకుని
చ్చిన వనితలు తమ సాధారణ పరిచయావకాశాలకి ఆమె
దూరమవ్వడం చూశారు ఆనాడు ఎడ్లని స్నానానికి తీసుకు
ళ్ళే ముసలి కాపువాడు ప్రతిరోజూ యింటిముందు ఆమెని
పలకరించడానికి ఆగేవాడు.

ఈ వూరు ముందు నించి ఎన్నో
లు వెడుతో వుంటాయి. ఆ మర్రిచెట్టు నీడన ఎందరో
యాత్రికులు సేద తీర్చుకుంటారు. ఎంతో మందిని సంతకి
తీసుకు వెడుతో బల్లకట్టు అవతలి రేవుకి తరచు వెడుతో
వుంటుంది. పడిపోయిన మెట్లకోనేరు పక్కనించి పోయే
పల్లెబాటదగ్గిరే నివసించేది ఆమె. ఆ స్థలాన్ని యిప్పు
డెవరూ గమనించరు. ఆమెనే నేను ప్రేమించేది.

17. మేఘాలపై మెరుపులు తమ అగ్ని
ముద్దుల్ని విసిరి, నవ్వుతో పరిగెత్తాయి. కవిమాత్రం ఓ
మూల వృక్షాలతో, మేఘాలతో ఏకమై నుంచున్నాడు; తన
హృదయాన్ని పుష్పంమల్లే మౌనంలో భద్రపరచి, చంద్ర
పట వెళ్లే తన కలలలోంచి అన్నీ కనిపెడుతో ఎండాకాలపు

సమీరంవలె ఏమీ పని లేకుండా తిరుగుతున్నారు. ఫాల్గుణ సాయంత్రం సంధ్య లోతుల్లోంచి చంద్రుడు బుద్బుదంవలె పైకి లేచాడు. మొక్కకి నీళ్ళు పొయ్యడంలో నిమగ్నమయి వుంది ఒక కన్య. తన లేడిపిల్లకి మేత పెడుతోంది ఒకామె. ఒకామె నెమలి చేత నాట్యం చేయిస్తోంది. ఆ సమయంలో కవిలోంచి గానం బైలుదేరింది. "ఈ లోకపు గూఢరహస్యాలు వినంది శశి ప్రేమకై కలువ పాలిపోయిందని నాకు తెలుసు. పద్మం ఉద్యత్ భానుడి ముందు తన ముసుకుని పక్కకి తీసుకుంటుందని నాకు తెలుసు. మీరు ఆలోచించారా కారణం చాలా సులభం. మొదటి మల్లె చెవులో మధుర ఝుంకార నాదానికి అర్థం విద్వాంసుడికి తెలీదు. కాని కవికి తెలుసు."

కెంజాయ మంటల్లో సూర్యుడు అస్తమించాడు. తారాపతి చెట్ల వెనక ఆలస్యంగా కదులుతున్నాడు. దక్షిణ మారుతం పద్మంతో రహస్యంగా పలికాడు' కవి కనపడేటంత వెర్రి వాడుకాదని, కన్యలూ, యువకులూ చప్పట్లు చరిచి పలికారు. "ప్రపంచ రహస్యం బైటపడ్డది" అని వాళ్ళు ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుని పాడారు. "మనలోని రహస్యాన్ని కూడా నాలుగుదిక్కులా విసిరేద్దాము." అని.

18. నువ్వు నాకు నీ హృదయాన్ని ఇచ్చేవంటే నీ కాలం గొడవలతో నిండిపోతుంది. నాలుగు దార్లూ కలిసే చోట వుంది నా ఇల్లు. నా తలుపులు ఎప్పుడూ

...ఫుంటాయి. నా మనసు పరాయత్తమై వుంటుంది, ...కె నేను పాడుకుంటో వుంటాను.

నువ్వు నీ హృదయాన్ని నాకు ...కు తప్పకపోతే, దానికి నేను జవాబుదారీ కాను. ...నేను నీకు మాట యిస్తే, గానం మౌనంలో అంత ...ప్పుడు ఏదో ధ్యాసలో వుంటే, నువ్వు నన్ను ...వాలి; ఎందుకంటె వైశాఖంలో ఏర్పడిన నిబంధన ...ంలో పొడిలేకయ్యేదం వుత్తమం.

నీ హృదయాన్ని నాకిచ్చావా, ...నే, తిరిగి తిరిగి జ్ఞాపకం చేసుకుంటో వుండకు. ...లో నీ కళ్ళు పాడుతున్నప్పుడు, నీ కంఠస్వరంలోంచి ...అలలుగా చిందేప్పుడు నీ ప్రశ్నలకి నా ప్రత్యుత్తరాలు ...గోచరంగా వుంటాయి. నూటిగా సత్యానికి అంటి ...పి వుండవు. వాటిని ఎప్పటికీ నమ్మాలి. తరవాత ...లేకుండా మరచిపోవాలి.

యాభై ఏళ్ళు రాగానే మానవ ...కల్లోల ప్రపంచాన్ని వొదిలి, అరణ్య ఏకాంతానికి ...ని రాసి వుంది గ్రంథాల్లో. కానన ఆశ్రమం యివ్వ ...నని ఉద్ఘాటిస్తున్నాడు కవి. ఎందుకంటే అదే పువ్వుల ...వాసం. పక్షులూ మధుపాలూ విహరించేది అక్కడే. ...వాడు ప్రియుల గుసగుసల ప్రకంపనకోసం నిభృత ...లు కాచుకుని వుంటాయి అక్కడే మాలతీ పుష్పా ...రకొర ముద్దు అన్నట్లు వెన్నెల, గాఢమైన సందే

కాన్ని అనుగ్రహిస్తుంది; కాని ఆ సందేశం అర్థం చేసు
కలిగిన వారు యువ్వనులే.

పాపం యువకులకి అను
లేదు. చెప్పిన మాట వినరు. కనక సంసార వ్యవహారా
ముసలి వారే చూసుకోవాలి. కుర్రవాళ్ళు గహనద్వా
ఏకాంతంలోకి వెళ్ళి ప్రణయ కర్కశ శిక్షణలో నిమగ్న
కావాలి.

20.

నీకు విలువ ఎక్కడ? అ
నా పాటని అడిగాను. ఎండా కాలపు దక్షిణ సమీరా
నశ్యంతో పండితులు మురికి చేస్తారే అక్కడేనా?

నూనె పాత్రకి ఆధారమూ, పా
నూనెకి ఆధారమూ అని అంతు లేకండా తర్కిస్తో వుంటా
అక్కడా? వేగంగా పరిగెత్తే జీవితపు సరదాల పైన ప
పోయిన పురాతన రాత గ్రంధాలు మంది పడే చోట వుంటావ
నువ్వు? అని అడిగాను. "కాదు, కాదు. ఒప్పుకోను." అంది
నా పాట.

ఐతే నీకు ఎక్కడ విలవనిస్తారు
భాగ్యవంతుడు తన పాలరాతి మందిరంలో అహంభావంతో
లా వెళ్ళి: తుళ్ళిపడతాడే అక్కడ విలువైన చర్మాలతో అట్ట
వేసి వాటిపేర్లు బంగారు అక్షరాలతో చిత్రించిన పుస్తకాల్ని,
కానీసలు దుమ్ము దులుపుతో, ఏ అనామక దేవతకో అంకి
తమై ఎవరూ ఎన్నడూ చదవని పుస్తకాలు అలమార్లని
అలంకరిస్తాయే.

...న వుండడం, యిష్టమా నీకు?"

...ను. అక్కడ వుండను" అంది నా పాట.

...గాలో తల

...మ యవ్వన స్వప్న లోకాలలో

...పన్న బల్ల మీద దిక్కు లేకండా పడివున్న పవనం,

...దయంలో దాక్కుని కవిత

...ప్ప కొట్టిన చీదర

...న్మార్థి చుట్టూ దోబూచులాడతావా అని అడిగాను నా

...టని.

బెరుకు బెరుకుగా తడబడుతో నా

...ట మౌనంగా వుండి పోయింది.

ఇంటి పనులు చేసుకుంటో, కొంచెం

...మయం దొరకగానే పడక గదిలోకి పరిగెత్తి, తన జుట్టుతో

...పాటే, పిల్ల నలిపేసిన కథల పుస్తకాన్ని దిళ్ళ కింద

...ని పైకి లాగే కొత్త పెళ్ళికూతురు దగ్గర వుండడం ఇష్ట

...మా నీకు?

నా పాట ఓ నిట్టూర్పు విడిచి

...హృదయంగాని కోర్కెతో వూగిసలాడుతోంది.

పక్షుల ఏ చిన్న రుతాన్నీ గౌరవించ

...నా కొదలలో.

ఎక్కడ ఏటి ముద్దు పలు
పూర్తి అర్థం కనపడుతుందో.

లోకంలోని అన్ని వికారవా
కంపించే రెండు హృదయాలపై తమ గాంధర్వా
వర్షిస్తాయో,

అక్కడ నీ నివాసం ఏర్ప
కుంటావా? అవునవును అంటో నిలవలేక అరిచింది నా హృ

21.

జీవిత ప్రారంభోదయం
ముందే నువ్వు ఆనందమయ స్వప్న జలపాతం
నుంచుని దాని ద్రవ ఉద్ధృతంలో నీ రక్తాన్ని నింపుకు
వనుకుంటాను, ప్రియా!

ఒక వేళ నువ్వు నందన
వీధుల్లో విహరించి వొచ్చేవేమో! అక్కడ మల్లెలూ,
వగాలు, కరవీరాలు, గంతులేసే పుష్ప సముచ్ఛయం
చేతుల్లోకి గుంపుల గుత్తులుగా నీ హృదయంలో ప్రవేశ
గంతులేస్తున్నాయేమో!

రాగాల రొదలో మాటలు ము
పోయిన పాట, అదృశ్య పుష్ప పరిమళ హర్షం నీ నవ్వు

నీ హృదయంలో దాగి
జ్యోతిశ్చ్ఛవతి నించి నీ అధర గవాక్షంగుండా, పైకి
వెన్నెల మల్లె వుంటుంది నీ నవ్వు.

నేను హేతువేమిటని అరగ
కారణం మరచి పోతాను, పొంగి పొరలి విరుచుకు
జీవిత సంరంభమే నీ నవ్వు అని మాత్రం తెలుసు నా

22. ఆనందమయమైన ఏ భవిష్యత్తు
లోనో, నేను గొల్ల పిల్లవాడిగా బృందావనంలో పుడితే
చాలు, మా వంశంలో సంస్కృతి నశించడానికి సంతోషంగా
అంగీకరిస్తాను.

గొల్లపిల్లవాడు మర్రిచెట్టు కింద
ఆమని పశువుల్ని మేపుతో రాధామనోహర పువ్వుల్ని
ని లేకుండా మాలల్లుతాడు. యమునానది నల్లని లోతు
ల్లో మునగడం, కొట్టు కోవడం అతనికి సరదా.

ఉదయం కాగానే, మేలుకోమని తన
ల్ని పిలుస్తాడు. ఆ వీధి ఇళ్ళన్నీ కవ్వాల శబ్దంతో
రాగాలు తీస్తాయి. పశువుల నించి ధూళి లేస్తుంది. పాలు
కడానికి దొడ్లలోకి వొస్తారు కన్యలు.

తమాల వృక్షాలకింద నీడలు చిక్క
ళతో వుంటాయి. నది వొడ్డున చీకట్లు అలుముకుంటాయి.
ంగే నీటిని దాటులో గొల్ల పడుచులు భయంతో వొణుకు
రు. పురి విప్పుకుని అరిచే నెమళ్ళు అడివిలో నాట్యం
స్తాయి. ఆ గొల్ల పిల్లవాడు ఎండాకాలపు మబ్బుల వొంక
స్తో చూచుని వుంటాడు.

కొత్తగా విచ్చిన పువ్వుమల్లే చైత్ర
సపు రాత్రి మధురంగా వుంటుంది. జుట్టులో నెమలి
న్ని గుచ్చుకుని అడివిలో మాయమౌతాడు. చెట్టు
మ్మల మీది పువ్వుల్ని ఉయ్యాల తాళ్ళకి అల్లుతాడు
ణ మారుతం, గానంతో పులకరిస్తుంది నీలపు నది
డ్డున గుంపుకూడతారు; సంతోషంగా గొల్ల పిల్లవాళ్ళు.

ఎక్కడ పాలని కన్యలు చిలకు తారో అక్కడ, ఆ తమాల వృక్ష ఛాయా మయ బృందావన గ్రామంలో నేనే పుట్టడానికి పిలుంతే—

సోదరులారా, ఈ నవ వంగ, నవీన యుగానికి నాయకుణ్ని ఎన్నటికీ కాను. చీకట్లో వెళ్ళే వారి కోసం సాంస్కృతిక దీపాన్ని వెలిగించడానికి ఆశ పడను.

23. ఆ ఇసిక వొడ్డు అంతే నాకు మక్కువ. అక్కడ ఏ సంచారమూ లేని నీటి గుంటలలో బాతులు గోల చేస్తాయి. తాబేళ్ళు ఎండలో వెచ్చగా పడు కుంటాయి. నిడుపు గడ్డి నీడలో పల్లెవాళ్ళ దోనెలు సాయం త్రాన ఆశ్రయం తీసుకుంటాయి.

వెదురు పొదల బాహువుల్లో నీడలు చేరుకుంటాయే, అక్కడ ఆ అడివి తీరమంతే నీకు ప్రేమ.

ఎంకర్లు తిరిగే బాటలోంచి బిందెలు పట్టుకుని వనితలు వొస్తారు అక్కడికి.

రెండు తీరాలకి అదేపాటపాడుతో, అదే నది మన మధ్య ప్రవహించింది.

నక్షత్రాల కింద ఇసికలోవొక్కణ్నీ పడుకుని ఆ పాట విన్నాను గట్టు కొసన ఏటవాలులో కూచుని తెల్లారకట్ట వెలుగులో విన్నావు: నువ్వు ఆ పాటనే, ఆ పాట నించి నేను విన్నమాటలు నీకు తెలీవు.

ఆ పాట నీకు వినిపించిన రహస్యం నాకు ఎన్నటికీ మర్మంగానే వుండి పోయింది.

నీ కిటికీ సగం తెరిచి, ముసుకు
...వరకు పైకెత్తి తన సరుకులతో వొచ్చే గాజుల బిత్తుని
...చూస్తో నువ్వు నుంచుని వున్నావు. దుమ్ము బాట
...పోలే బరువుగా కిర్రుమనే బండిని, దూరంగా వున్న
...లో ఆకాశపు అంచున నెమ్మదిగా కదిలే తెరచాప
...ప్పని, నువ్వు సోమరిగా చూస్తో వున్నావు.

పొందిక లేని మనో చిత్రాలతో
...న అర్ధంలేని పాటలు పాడుతో రాట్నం తిప్పే
...మ్మ రాగాల మధ్య కనపడుతుంది నీకు ప్రపంచం.
...త సరుకులతో, ఆ గాలి ఆడని సోమరి మధ్యాహ్నం ఆ
...బిడుదు బైలుదేరి వొస్తున్నాడేమో మరి.

స్పష్టమైన తన అరుపుతో, నీ తలుపు
...దు. సించే వెడతాడు. నీ కిటికీని ఒక్కవూపులో
...వేస్తావు నీ ముసుగుని లాగి అవతల పారేస్తావు. నీ
...మనకలోంచి బైటికి వొచ్చి నీ భవిష్యత్తుని కలుసు
...టావు.

నీ చేతుల్ని గట్టిగా పట్టుకున్నాను.
... హృదయం నీ కళ్ళ నలుపు లోతుల్లోకి మునుగుతోంది.
...టల వెనక, మౌనం వెనక నన్ను ఎన్నటికీ తప్పించుకునే
...న్ను వెతుకుతూ.

కాని నాకు తెలుసు. చిక్కకదో బూచు
...చే నీ విలాసాలతో నా ప్రేమ తృప్తి పడాలని.

ఎందుకంటె నాలుగుబాటలూ కలిసే
...చోట మనం కలుసుకున్నాము, ఒక క్షణం.

లెక్కలేని ఈ లోకాలగుండా, ఈ మార్గాల వ్యూహాల్లోంచి నిన్ను జాగ్రత్తగా తీసుకు పోయే శక్తి నాకు వుందా? మృత్యు గహ్వరాలు మింగ చూసే చీకటి మార్గాన నిన్ను నిలుపుకోగల ప్రాణ నాలో వుందా!

26

ఎందు చేతనన్నా నువ్వు నన్ను తలుచుకుంటే, వర్ష సాయంత్రం తన నీడల్ని సడి ఓకి వొదిలినప్పుడు తన మసక వెలుగును పడమటి దిశకు మెల్లగా లాక్కునేప్పుడు నేను నీకు పాడతాను. పగటి శేష భాగం పనికిగాని, ఆటకిగాని పనికిరానంత యిరుకుగా వుంటుంది అప్పుడు.

నీ దక్షిణ ప్రాంగణంలో నువ్వు చూసుని వుంటావు. వెలుతురు లేని గదిలోంచి పాడతాను నేను. దట్టమయ్యే చీకట్లో తడి ఆకుల వాసన కిటికీలోంచి లోపలికి వొస్తుంది. కొబ్బరి తోపులో తుఫాను పవనాలు గంద్రగోళం చేస్తాయి

వెలిగించిన దీపం గదిలోకి తెచ్చినప్పుడు నేను వెళ్ళిపోతాను. అప్పుడు బహుశా రాత్రి లోకి వింటావు. నేను పాడనప్పుడు నా పాట వింటావేమో!

27.

నాకున్నదంతటినీ పళ్ళెం నిండా నింపి నీ కిచ్చాను. రేపు నీ పాదాల దగ్గిరికి ఏం తీసుకు రావాలా అని యోచిస్తున్నాను పుష్ప భరితమైన వేసవి చివరలో, తన పువ్వుల్ని రాల్చేసి నగ్నంగా తన కాళ్ళని పైకెత్తి ఆకాశం వంక చూసే వృక్షం మల్లే వున్నాను.

ఇదివరకు నేను నీ కిచ్చిన కానుకలో, పువ్వులతో శాశ్వతత్వాన్ని పొంది నశించని పువ్వొక్కటి కూడా లేదా? వసంత చివర శలవ తీసుకుంటో రిక్త హస్తాలతో నీ ముందు నిలుచున్నప్పుడు దాన్ని జ్ఞాపక ముంచుకుని నీ కళ్ళతో నన్ను మెచ్చు కుంటావా?

28. ఆమె స్పర్శ గానాన్ని వినిపిస్తో ఆమె వేళ్ళతో నా జుట్టుని ముద్దుగా నిమురుతో నా తల దగ్గిర కూచుందని కల కన్నాను.

నా కన్నీళ్ళని ఆపుకోడానికి తంటాలు పడుతో ఆమె ముఖం వంక చూశాను. పైకిరాని మాటల వ్యధ నా నిద్రని బుద్బుదం వలె బద్దలు చేసింది.

నేను లేచి కూచున్నాను. మండి పోతున్న ఓ నీరవ ప్రపంచం వంటి ఆకసపు క్షీర వాహిని కాంతి వంక చూశాను. ఈ క్షణాన ఆమె కూడా నా కలతో, శ్రుతి పలికే కలని కంటుందేమోనని ఆశతో ఆలోచించాను.

29. కంచె మీదిగా కళ్ళు కలుసుకున్నప్పుడు, ఆమెకి నేనేదో చెప్పాలనుకున్నాను. కాని ఆమె వెళ్ళి పోయింది. కాల తరంగాల మీద పడవ మళ్లీ వూగుతోంది, నేను ఆమెకి చెప్పాలనుకున్న ఆ మాట.

ఆది అంతం లేని అన్వేషణలో శరత్ మేఘాలపై తేలి పోతున్నట్టుగా వుంది; సూర్యాస్తమయంలో తన చివరి నిమిషాన్ని వెతుక్కుంటో.

నిరాశ మసకలో తన అగ్నిని కనుక్కోడానికి, నా హృదయంలో మిణుగురుల పగ్గె మిణుకు మిణుకు మంటోంది, ఆమెకి నేను చెప్పాలనుకున్న మాట.

30.

వసంత పుష్పాలు, నీరవ ప్రణయ ఉధృత వ్యధమల్లే విరుచుకు పడుతున్నాయి. వాటి శ్వాసతో నాలో పాత కాలపు పాటల జ్ఞాపకాలు రేగుతున్నాయి, అకస్మాత్తుగా, నా హృదయం నవ కోమల పల్లవాల్ని తొడిగింది. నా ప్రియాంగన రాలేదు. కాని ఆమె స్పర్శ నా దేహమంతటా నిలిచి వుంది. పరిమళించే పొలాల మీదిగా ఆమె కంఠం వినవస్తోంది. ఆకాశ విషాద అగాధాలలో ఆమె చూపు కనపడుతుంది. కాని ఆమె నేత్రాలేవి? ఆమె ముద్దులు గాలిలో తేలి పోతున్నాయి. కాని ఆమె పెదవులేవి?

31.

నా పువ్వులు, పాలమల్లె, తేనెమల్లె మదీరామల్లె వుండేవి. ఓ బంగారు దారంతో వాటిని గుచ్ఛంగా కట్టాను. ఎంత జాగ్రత్తగా కనిపెట్టి చూసినా, వాలిపోయినాయి. ఆ దారం మాత్రమే మిగిలి పోయింది.

నా పాటలు పాలూ, తేనె, మధువు వలె వుండేవి. స్పందించే నా హృదయపు లయలో నిలిచి పోయాయి అవి. కాని అవి రెక్కలు చాచి ఎగిరి పోయాయి. సోమరి గడియల ముద్దు బిడ్డలవి. నా హృదయం నిశ్శబ్దంలో ధ్వనిస్తోంది.

నేను ప్రేమించిన సుందరి, పాల
క్క, తెనెమల్లె, మధువు మల్లె వుండేది. ఆమె పెదవులు
పాపజీవు మెరుపు. ఆమె కళ్ళు మధుపాల వలె నలుపు.
ది ఉలిక్కి పడవేస్తుందేమోనని నా హృదయాన్ని
ద్ధం చేసుకున్నాను. కాని నా పువ్వుల మల్లె నా పాటల
ల్లె తప్పించుకు పోయింది. నా ప్రేమ వొంటరిగా నిలిచి
యింది.

32. వసంత దినం తలుపు తట్టినప్పుడు
ంపార్లు, పనిలో నిమగ్నుణ్ని వున్నాను. నువ్వు బదులు
లేదు. కాని యిప్పుడు నేను వొంటరినైపోయి,
హృదయం వ్యథలోపడేప్పుడు, వసంత దినం తిరిగి
స్తుంది. అతన్ని హొమ్మని చెప్పడం ఎట్లాగో తెలీడం లేదు.

అతను మనపై ఆనందాభిషేకం
య్యాలని వొచ్చినప్పుడు మన తలుపు మూసి వుంది. కాని
ప్పుడు వ్యసన పరిధానంతో వొచ్చాడు. తలుపు తీసే
ంచాలి.

33 ఏదీ లెక్క చెయ్యని గులాబి
లతో, కొత్తగా చిగిర్చిన అశోక కిసలయముల ఎర్రని
ద్దంతో ఆకాశాన్ని ముంటలు పెడుతో, నవ్వుల బిళ్వ
తో నా జీవితంలోకి ఓ నాడు ప్రవేశించిన వసంతం.

ఇప్పుడు, ఈనాడు, నా వొంటరి
ంలోకి దొంగ చాటుగా నిర్మానుష్యమైన దారులగుండా.

నిశ్శబ్దంతో బరువెక్కిన నీడల
ండా ప్రవేశించి.

వెల వెలబోయే ఆకాశంలో హరిత వర్ణం అలిసి మూర్ఛిల్లే పృథ్వీ మీద నా ప్రాంగణంలో కూచుని బాలాల మీదిగా చూస్తోంది.

34.

కిందికి వేళ్ళాడే వర్ష మేఘంమల్లె మనం విడిపోయే నిమిషం తటస్థించినప్పుడు, నా చేతుల వొణుకుతో నీ మణికట్టుకి ఎర్రని తోరాన్ని కట్టడానికి మాత్రమే నాకు వ్యవధి వుండి పోయింది. ఇవాళ యిప్ప పువ్వుల కాలంలో నేను పచ్చికమీద కూచున్నప్పుడు నీ చేతికి నేను కట్టిన తోరాన్ని యింకా నీతో వుంచుకున్నావా అన్న వొక్క ప్రశ్న నా మనసులో.

పుష్పించే జనప పొలం పక్కనించి వెళ్ళే సన్నని దారి మీదికి వెళ్లావు. నిన్న రాత్రి నేను నీ జుట్టులో పెట్టిన పూలదండ వొదులుగా అక్కడే వేళ్ళా ంతో వుండడం చూశాను. నా చివరి కానుకగా ఇవ్వ ానికి పొద్దున్నే కొత్త పూలు ఏరి తెచ్చిందాకా, నువ్వు ందుకు ఆగలేదు? నీకు తెలీకుండానే మధ్య తోవలో పడి లేదు కదా, అని ఆలోచిస్తాను, నీ జుట్టునించి వొదులుగా ళ్ళాడే పూలదండ.

ఉదయం, సాయంత్రం నీకు ఎన్నో టలు పాడాను నువ్వు వెళ్ళి పోయినప్పుడు నా చివరి టని నీ కంఠంలో తీసుకు పోయినావు. నీ కోసం త్రమే ఎన్నటికీ నాలో వున్న పాడని పాటని వినడానికి ల్వి నిదానించి వుండి పోలేదు. పొలం లోంచి నడుస్తో,

...కంఠంలో పాడుకుంటూ వెళ్ళిన పాట, నీకు విను ...లేవ కదా చివరికి అని యోచిస్తాను.

నిన్న రాత్రి మబ్బులు భయపెడు ...యి: గాఢంగా వీచే గాలికి వశమై, ఉసిరి కొమ్మలు ...తున్నాయి. వానతో, ధ్వనించే ఆ ఒంటరి రాత్రిలో ...సన్న చేర వొస్తే, అవి నా ప్రియాంగన రూపంలో ...యని ఆశ పడ్డాను.

హోలాలగుండా గాలులు ఇంకా ...గుతున్నాయి. కన్నీటితో తడిసిన ఉషాకపోలాలు ...పోతున్నాయి నా కలలు వ్యర్థమైనాయి. ఎందు ...నిజం కఠిన మయింది. కలలు కూడా తమ స్వంత ...లోనే నడుస్తాయి.

నిన్న రాత్రి చీకటి, తుఫానులో ...తాగినప్పుడు: రాత్రి వేసుకున్న ముసుకువలె ...గాలిలో చీలికలైనప్పుడు, వానతో శబ్దించే, నక్షత్రాలు ...రాత్రిలో, నాప్రియాంగన రూపంలో అసత్యం నావద్దకు ...సత్యానికి ఈర్ష్య కలుగుతుందా?

నా బంధాలూ, నా హృదయంలో ...గానం చేశారు. దినమంతా మీతో ఆడుకున్నాను. ...ల్ని నేను భూషణంగా కూడా ధరించాను. మనం ...మిత్రులమైనాము. మిమ్మల్ని చూసి భయపడ్డ సమ ...కూడా వుండేవి. కాని నా భయంవల్ల మిమ్మల్ని

మరింత ప్రేమించాను. దీర్ఘమైన నా చీకటి రాత్రుల్లో మీరు నా సహోదరులై వుండేవారు. నేను మీ నించి శలవ తీసుకునే ముందు మీకు నమస్కరిస్తున్నాను.

37. నా నావా, నీ చుక్కాని ఎన్నో సార్లు విరిగింది. నీ తెరచాపలు చీలికలుగా చిరిగి పోయినాయి. చాలా సార్లు నువ్వు లంగర్ని ఊడ్చుకుంటో సముద్రం వేపు లెక్కచెయ్యకండా కొట్టుకుపోయినావు. కాని ఇప్పుడు నీ అడుగు భాగం, పగిలి నీళ్ళతో బరువెక్కింది. ఇంక నీ ప్రయాణాలు చాలించే సమయమయింది. ఒడ్డున కొట్టుకునే నీళ్ళు నీకు జోలపాట పాడుతో వుంటే, హాయిగా నిద్ర పో.

కాని నాకు తెలుసు, ఏం చెప్పి ప్రయోజనం లేదని. ముసుకు వేసుకున్న అంధకార వినాశపు ముఖం నిన్ను మరగించి పిలుస్తోంది. తుఫానుం అల వున్మాదం నిన్నావరించింది. ముందుకు పొంగి వచ్చే సముద్రగానం పైకి లేస్తోంది. ఆ నాట్యపు తాపంతో నువ్వు వణికి పోతున్నావు. సరే, నీ గొలుసు తెంచుకుని, నా నావా, స్వేచ్ఛగా నిర్భయంగా, వేగంగా పోయి పగిలిపో.

38. నేను యవ్వనంలో వున్నప్పుడు, ...ంగా, వేగంగా, ప్రవాహంలో కొట్టుకు పోయేవాణ్ణి. ...ంత మారుతం తనకున్నదంతా వెదచల్లుకునేది. చెట్లు పుష్పాలతో వెలిగిపోయేవి. పక్షులు పాటలతో నిద్రపోయేవి లు.

ఘోంగే నాలోని ఉద్వేగంలో పడి,
ిగే వేగంతో, పయనించాను. నిదానించి చూడడానికి,
న్ని నాలోకి తీసుకోడానికి, అనుభవించడానికి వ్యవధి
ి కాదు. నన్ను పొద్దున వదిలేసి, యవ్వన ప్రవాహం
ప్పటికీ, అన్నిటి లోతైన గానం వినగలుగుతున్నాను.
క్షిత్ర హృదయాన్ని ఆకాశం నా ముందు తెరిచింది.

నా కళ్ళ వెనక కూచుని అన్నిటినీ
వాడొకడున్నాడు. యుగాలుగా ఎన్నిటినో చూచి
్నాడు అతను. జ్ఞాపకాల తీరాల అవతలి లోకాన్ని
స్తున్నాడు. ఆ మరచి పోయిన దృశ్యాలు పచ్చిక
మెరుస్తాయి. ఆకులమీద కంపిస్తాయి. పేరులేని, న
సంధ్య వెలుగుల సమయాల్లో ఏకైక ప్రియావదనాన్ని
కొత్త మేలిముసుకుల కింద చూశాడు. కనక అసం
కలయికలతో, ఎడబాటులతో అతని ఆకాశం బాధా
మయింది. ఈ వసంత మృదుపవనం వేదనావృత
ంది. ఆది నెరగని యుగాల రహస్య భాషా ధ్వనులతో
క్కిన వేదన అది.

మాయమైన నా యవ్వన కాలం
నాకో సందేశం వొచ్చింది. ఇంకా ఉదయించని పై శాఖ
పనల్లో, నీ కోసం కాచుకుని వున్నాను అక్కడ
టికై చిరు నవ్వులు ఫలిస్తాయి. ఇంకా పాడని పాట
ఘడియలు వేదన పడతాయి. వయసు అనే అరిగి

పోయిన మార్గంమీద మృత్యుద్వారంగుండా నా దగ్గిరికి రా. ఎందుకంటే, కలలు మాయమౌతాయి ఆశలు అణిగి పోతాయి. సంవత్సరమంతా కూడబెట్టుకున్న ఫలితాలు పాడైపోతాయి. కాని నేను మాత్రం శాశ్వత నిత్యసత్యాన్ని. తీరంనించి తీరానికి పయనించే నీ జీవిత యాత్రలో, నువ్వు నన్ను తిరిగి తిరిగి కలుసుకుంటావు.

41. నది నించి నీళ్ళు తెచ్చుకోడానికి బైలుదేరారు పడుచులు—చెట్లలోంచి వాళ్ళ నవ్వులు వినవొస్తున్నాయి. బాటలో వాళ్ళని కలుసుకోవాలని మనసు పడుతున్నాను. అక్కడ నీడలో మేకలు గడ్డి మేస్తో వుంటాయి. కింద పడ్డ ఆకుల మీదనించి ఉడతలు, ఎండ లోంచి నీడలోకి గంతులేస్తాయి.

కాని, ఈరోజు నేను చెయ్యవలసిన పనిని చేసేశాను. నా అండాలు నింపాను. నేను నా తలుపు దగ్గిర నుంచుని పోక చెట్ల ఆకుల మీద మెరిసే, ఆకుపచ్చని రంగుని చూస్తో, నది నించి నీళ్ళు తేవడానికి వెళ్ళే ఆడవాళ్ళ నవ్వుని వింటో వుంటాను. మంచులో తడిసిన ప్రభాత నవ్యతలో, అలిసిన అస్తమయ కాంతిలో నిండిన నా బిందె బరువుని ప్రతి రోజూ మొయ్యడం నాకు యిష్టంగా వుంటుంది.

నా మనసు సోమరిగా వున్న సమయాల్లో, దాని గల గలమనే నీళ్ళు నాతో ముద్దు మాటలు మాట్లాడేవి. నా సంతోషపు ఆలోచనల సడిలేని నవ్వుతో

నవ్వేవి. నేను విచారంగా వున్నప్పుడు. అవి కన్నీళ్ళ
...క్కతో నా హృదయంలో మాట్లాడేవి. పావురాల
...అగులు వాన చప్పుడు వినబడకుండా చేసేటప్పుడు ఆ
...ాను రోజుల్లో నీళ్ళు ఖండెని మోశాను.

నేను ఇవాళ చెయ్యవలసిన పనిని
...ాను. జాడీల్ని నింపాను. పడమట కాంతి తగ్గి పోతోంది.
... కింద నీడలు చేరుకుంటున్నాయి. అవిసి తోటల నించి
...ాప్పు వినవొస్తోంది. గ్రామంలోంచి నల్లని నదివేపుపోయే
... వెంట వెడుతున్నాయి నా వాంఛాయుత నేత్రాలు.

నువ్వు ఉత్తచిత్ర పటానివి మాత్ర
...ా? ఆ నక్షత్రాలంత వాస్తవం కాదా? ఈ మట్టిమల్లె
...ా నిజం కాదా? ప్రతిదాని నాడీ చలనంతోనూ, స్పంది
...ు అవి. చిత్రించిన ఆకారపు నిశ్చలత్వంలో నువ్వు
...ా ఎడంగా వుంటావు.

వెచ్చని వూపిరితో నీ అవయవాల
...న రాగంతో నువ్వు నా పక్కన నడిచిన రోజులుండేవి.

నీ కంఠ రవంలో నా ప్రపంచపు
...క్క రూపొందింది. నీ ముఖంలోంచి బైట ప్రపంచం నా
...ృదయాన్ని తాకింది. అనంతత్వపు ఛాయల్లో నువ్వు
...స్మాత్తుగా నిలిచి పోయినావు. నేను వొంటరిగా ముందుకు
...దాను. పిల్లవాడి మల్లె నవ్వుతో జీవితం చావు గిలకను
...్తూ పరిగెత్తుతోంది. నిన్ను వెంట రమ్మని పిలుస్తుంది.
... అగోచరమైన దాని వెంట వెడుతున్నాను. ఆ

నక్షత్రాల వెనకా, దుమ్ము వెనకా ఎక్కడ ఆగిపోయినావో అక్కడే నుంచుని వున్నావు. నువ్వు వుత్త చిత్రానివి మాత్రమే కావు, వీల్లేదు.

నీలో జీవిత ప్రవాహం పూర్తిగా ఆగిపోతే, అది నదీ ప్రవాహాన్ని ఆపుతుంది. పర్ణ వైచిత్రి యాల ఉషా ఆగమనాన్ని ఆపేస్తుంది. ఎక్కడా ఆశవెనగని అంధకారంలోని, శిరోజాల నలుపు మెరుగు మాయమైతే, తన స్వప్నాలతో సహా వసంతోత్సవ అరణ్య ఛాయలు మరణిస్తాయి.

నేను నిన్ను మరిచిపోయాననేది నిజ మౌతుందా? బాట పక్కన కంచె మీది పువ్వుల్ని మరిచి ఆలోచన లేకుండా ముందుకు తొందరగా నడుస్తాము. అయినా మన మరపులోకి గుర్తు లేకుండానే వాటి శ్వాస తగులుతోనే వుంటుంది: మన జ్ఞాపకాల్ని సంగీతంతో నింపుతో, నా బతుకు మొదట్లో స్థానమేర్పరుచుకోడానికి, నా లోకం నించి కదిలి పోయినావు. అయినా, తన లోతుల్లో దారి తప్పిన జ్ఞాపకాన్ని మరిచి పోవడమంటావా?

నువ్వు నా పాటల ఎదుట లేవు. వాటితో ఏకమైనావు. ఉషా ప్రథమకిరణంతో వచ్చావు నా దగ్గిరికి. సాయంకాలపు చివరి స్వర్ణ ఛాయలో నిన్ను పోగొట్టుకున్నాను.

ఆనాటినించి, చీకట్లో నిన్ను కలుసు కుంటూనే వున్నాను. కాదు, నువ్వు చిత్రానివి ఏ మాత్రం కాదు.

నువ్వు చచ్చిపోయి నిరవద్యత్వ
...నిస్పృహాని నా జీవితంలో వొదిలి వెళ్ళావు. నీ
...మణి సూర్యాస్తమయ వర్ణాలతో, నా ఆలోచనా
...లాన్ని చిత్రించింది ఈ ప్రపంచం మీదిగా ప్రేమ
...నికి కన్నీళ్ళు చారని వొదులుతో నీ ప్రియబాహు
...ంగ వివాహబంధంలో, మిలనమైనాయి, నా జనన
...జాలు నాలో.

సమస్త ఆది అంతాలు ఎక్కడ
...తామో, ఆ ప్రాంగణంలో, దీపం వెలిగించుకుని,
...వ్వు కాచుకుని వుండడం నేను వూహించుకోగలను. నీవు
...చిన తలుపుల్లోంచి, నా లోకం, ఇక్కడ నించి వెళ్ళి
...యింది. నీ జీవితంతో మరణ పాత్రని నింపి, నా పెదవుల
...దించావు.

4. నీ స్మృతిలో నువ్వు నా నించి
...కల వున్న వాటి అన్నింటికీ చచ్చిపోయినావు.
...పంచంలోవున్న వాటి నన్నింటినించీ మాయమై నా
...ఖ్యంలో పూర్తిగా పునర్జన్మను పొందావు. నా జీవితం
...ప రహిత సంపూర్ణతను పొందినట్లుగా తోచింది. స్త్రీ,
...రుషులు నాలో శాశ్వతంగా ఏకమైనారనిపించింది.

5. నువ్వుబతికివున్నప్పుడు నాఇంటిని
...ట్లా శుభ్రం చేసి సర్ది వుంచే దానివో, లలనా, అట్లానే, నా
...ంటరి బతుకు లోకి అందాన్ని, క్రమాన్ని, తీసుకురా.

ఈ గడియల దుమ్ము నలుపుల్ని వూడ్చెయ్యి. నిర్మల శీతలాంబువులతో నాలోని శూన్య పాత్రలను నింపు. నేను ఉపేక్ష చేసిందాన్నంతా సరిదిద్దు.

అటు తర్వాత పూజా మందిర గర్భ ద్వారాన్ని తెరిచి దీపం వెలిగించు. ఆ నిశ్శబ్దంలో మౌనంగా మన దైవం ముందు మిళిత మౌదాం.

46.

అంతంలేని తన నీలం వంక చూస్తు కుంటో తలలు కంటుంది ఆకాశం, మేఘాలం మేము, నింగిలో తేలిపోయే తలపులం. మాకు నివాస స్థలమంటో ఒకటి లేదు. నిరవధి కిరీటంపైన వెలుగుతాయి తారలు. వాటి చరిత్రలు ఎప్పటికీ నిలుస్తాయి. మావి తేలికగా తుడిచేసేటట్టు చిత్రిస్తారు. మా కంజీరాలు వాయిస్తో వాయు రంగం మీదికి వొచ్చి నవ్వు తరంగాలని విసరడమే పని మాకు. మా నవ్వు నించి వొస్తుంది వాన. అది వాస్తవం. ఉరుములు మా నవ్వులోంచే పుడతాయి. అదేం తమాషా కాదు. కాని మా పనికి ప్రతిఫలమిమ్మని కాలాన్ని అడగ డానికి మాకేం అధికారం లేదు. మమ్మల్ని ఉనికిలోకి రప్పిం చిన శ్వాసే, మాకో పేరు ఏర్పడక ముందే, మమ్మల్ని ఇక్కడ నించి విసిరేస్తుంది.

47.

రాజవీధి, నేను, ఎడబాయని నేస్తాలం. రోజంతా నా పాదాల కింద నించి మాట్లాడుతుంది. రాత్రంతా నా తలలో పాడుతో వుంటుంది. నేను ఆమెని కలుసుకో డానికి, మొదలంటో లేదు. ప్రతి ఉదయానా అంత

రహితంగా ప్రారంభిస్తుంది మా స్నేహం. కొత్త పువ్వులతో, పాటలతో ఆమె వసంతాగమనం జరుగుతుంది. ప్రతి కొత్త ముద్దు ఆమె నించి నాకు మొదటి ముద్దు.

నేనూ, ఈ రాజవీధీ, మేమిద్దరం ప్రేమికులం. రాత్రి తరువాత రాత్రి నేను ఆమె కోసం నా బట్టల్ని మార్చుకుంటాను. ప్రభాతమైనప్పుడు చిరిగిన జీర్ణ వస్త్రాల్ని రోడ్డు పక్క సత్రాలలో వొదిలేస్తాను.

48. ఆ పాత బాట వెంబడి రోజూ వెదుతో వుంటాను. నేను నా పళ్ళని సంతకి తీసుకు వెడతాను. నా పశువుల్ని బయళ్ళకి తోలతాను. నా పడవ మీద ఏటిని దాటుతున్నాను. ఆ మార్గాలన్నీ నాకు బాగా పరిచయం.

ఆ ఉదయాన నా గంప నిండా సరుకులు బరువుగా వున్నాయి. పొలాలలో మనుషులు పని చేస్తున్నారు. పచ్చిక బయళ్ళ నిండా పశువులు మేస్తున్నాయి. వరి పంటతో భూమి రొమ్ము సంతోషంగా పొంగి పోతోంది. అకస్మాత్తుగా గాలి పులకరించింది. ఆకాశం నా నుదుటిని ముద్దు పెట్టుకున్నదనిపించింది. పొగమంచు లోంచి వుదయ కాంతివలె, నా మనసు మేలుకుంది.

ఆ బాట వెంట పోవడం మరిచి పోయినాను. తోవ నించి నాలుగడుగులు పక్కకి నడిచాను. మొగ్గగా నాకు పరిచయమైన పుష్పంవలె నాకు తెలిసిన లోకం కొత్తగా కనపడ్డది.

నా మామూలు ప్రపంచ జ్ఞానం సిగ్గుపడ్డది. దారి తప్పి దేవతాలోకంలో తిరుగుతున్నాను. ఆ ఉదయం నేను దారి తప్పి, నా నిరంతర బాల్యాన్ని కనుక్కున్నాననేది నా జీవితానికి, అది ఉత్కృష్టమైన అదృష్టం.

49. స్వర్గం ఎక్కడ వుంది? అని నన్నడుగుతున్నావు పాపా!

రాత్రింబవళ్ళనే అయని మించిన, చావు పుటకలకి అవతల వుంటుంది. ఈ పృథ్వికి సంబంధించింది కాదు, అని అంటారు ఋషులు.

కాని, నీ కవికి తెలుసు, దాని నిరంతర ప్రజల వాంఛ కాల దేశ మానాల బంధంలోకి అవతరించాలని.

ఫలవంతమైన దుమ్ములో జన్మించాలని నిరంతరం యత్నిస్తో వుంటుందని.

మధురమైన నీ దేహంలో స్వర్గం సఫలత పొందుతోంది, నా బిడ్డా, నీ స్పందించే హృదయంలో.

సముద్రం సంతోషంలో తనభేరిల్ని మోయిస్తోంది. నిన్ను ముద్దు పెట్టుకోడానికి పువ్వులు మెడలు చాస్తున్నాయి. భూమాత చేతుల్లో స్వర్గం జన్మ తీసుకుంటోంది.

50. రా, చందమామా, కిందికి వొచ్చి, నా పాపాయి నుదుటి మీద ముద్దు పెట్టుకో. తన పాపని వొడిలో పెట్టుకుని, పిలుస్తోంది తల్లి. చందమామ కలలు కంటో చిరు నవ్వుతోంది.

చీకట్లో మెల్లిగా అడుగులు వేసు కుంటో ఎండాకాలపు అవ్యక్త పరిమళాలు, నీడలతో ఐరు వెక్కిన మామిడి తోపుల్లోంచి రాత్రి పక్షుల పాటలు వొస్తు న్నాయి.

దూరపు పల్లె నించి కాపు అతని పిల్లంగోవిలోంచి, జాలి గొలిపే స్వరాల ప్రవంతి పైకి విన వస్తోంది. డాబా మీద కూచున్న చిన్న తల్లి, వొడిలో పిల్లని పెట్టుకుని, మధురంగా పాటపాడుతోంది.

"రా, చందమామా, కిందికి వొచ్చి నా పాపని నుదుటి మీద ముద్దు పెట్టుకో" అని.

ఓ సారి ఆకాశంలోని దీపం వంక చూస్తుంది. తరవాత తన చేతుల్లో వున్న భూమి మీది దీపం వంక చూస్తుంది. చంద్రుడి చలనం లేని మౌనం చూసి నేను ఆశ్చర్యపడ్డాను.

పాప నవ్వుతో

రా, చందమామా, రా,

అనే తన తల్లి పిలుపుని తాను వెక్కిరిస్తుంది. తల్లి చిరు నవ్వు తోంది. ఆ వెన్నెల రాత్రి నవ్వుతుంది. కవిని, ఆ పాప

తండ్రినైన నేను కనపడకుండా ఆ దృశ్యాన్ని వెనకనించి చూస్తో నుంచున్నాను.

51. శరత్ ప్రారంభంలోని, ఈ దినం నిర్మేఘమై వుంది. రేవు దగ్గిర పడిపోవడానికి వూగిసలాడే చెట్టు బైట పడ్డ వేళ్ళని తాకుతో నది నిండుగా ప్రవహిస్తోంది. ఆ వూరి సన్నని పొడుగాటి బాట, దాహం గొన్న నాలికమల్లె ప్రవాహంలోకి చాచుకుని వుంది. నా చుట్టూ చూశాను. నిశ్శబ్దమైన ఆకాశాన్నీ, ప్రవహించే నీటినీ, శిశువు ముఖాన కనపడే చిరునవ్వంత సులువుగా సంతోషం సర్వత్రా పరిచి వున్నదని చూసి నా హృదయం ఆనందంతో నిండింది.



52. ఆలస్యాన్ని భరించక చలికాలం గడవక ముందే మీ బంధాలన్నీ తెంపుకున్నారు. సహనం లేని పువ్వుల్లారా! ముందుకి దూకే మల్లెల్లారా, గోలచేసే గులాబి గుంపుల్లారా, ఇంకా మీరుచూడని అతను వొస్తున్న సూచనలు మీరు తోవ పక్కన తొంగిచూస్తుండగానే మిమ్మల్ని చేరాయి. మీరు నవ్వులో, వగరుస్తో బైటికి తొందరగా తీసుకువొచ్చేశారు.

మరణ ద్వారాన్ని చేరుకోవడానికి మీరు ప్రథములైనారు. మీ రంగులు, మీ పరిమళాలు వాయువును రభస పెట్టాయి. మీరు నవ్వుతో, వొత్తుగా వొకరు నొకరు తోసుకుంటూ, మీ పణాన్ని లోకానికి తెరిచి, గుట్టలుగా పడిపోయినారు.

సమయమైనప్పుడు దక్షిణ మారుతంలో తేలి పోతో వసంతుడు వొస్తాడు. కాని అతని రాకను రూఢి చేసుకోవాలనే తొందరలో, మెల్లిగా కదిలే నిమషాన్ని లెక్క పెడుతో కూచోలేదు మీరు. భీకరోల్లాసంతో తోవలోనే వ్యయం చేశారు మీకున్నదంతా. అతని పాదధ్వనుల్ని దూరం నించే విన్నారు. అతను నడిచేందుకు మీ మరణ దుకూలాల్ని కింద విసిరేశారు. మీ రక్షకుడు కనిపించక ముందే మీ బంధాలు తెగి పోయినాయి. అతను వొచ్చి మిమ్మల్ని తన వారినిగా తీసుకోక ముందే, అతన్ని మీ సొంతం చేసుకున్నారు.

53. చైత్రమాసం చివరి రోజుల్లో, నేను మొగ్గనై జన్మించాను. ఇష్టపడని వసుంధరని సూర్యుడు తన ముద్దులతో కాలుస్తున్నాడు జడధారి కుటీరంలోకి తొంగి చూసే అల్లరి పసబాల వలె సగం భయంగా సగం కౌతుకంగా వొచ్చాను నేను. శిథిలమైన అరణ్య రహస్య భయకంపిత శబ్దాల్ని విన్నాను. వేసవి అలసటని తన స్వరంలో పలికింది కోయిల. గాలికి కొట్టుకునే నా పురిటి గది ఆకుల తెరలోంచి, నేను లోకాన్ని చూశాను. అది నిర్వర్ణంగా, నిర్విణ్ణంగా, నిశ్శోభగా కనపడ్డది.

అయినా నేను యవ్వన విశ్వాసంతో బలంగా బైటికి వొచ్చాను. వెలిగిపోయే ఆకాశ మధుపాత్ర నించి, మండే మధ్యాహ్నాన్ని తాగి ఉదయాన్ని గర్వంగా అభినందించాను. సూర్యుడి పరిమళాన్ని నా హృదయంలో ధరించిన, నేను చంపక పువ్వుని.

54. మొదట్లో, కాలం ఆదిలో ఈశ్వరుడి స్వప్న మథనంలోంచి అంగనలు ఇద్దరు ఉదయించారు. ఒకామె స్వర్గ ఆస్థాన నర్తకి; పురుషుల హృదయంగమ లావణ్య మూర్తి. సారరహిత ధ్యానాల నించి ఒక్క నవ్వుతో జ్ఞానుల మనసుల్ని లాగేస్తుంది. వారి శూన్యత్వం నించి బుద్ధి హీనుల్ని ఒక్క నవ్వుతో కదిలించేస్తుంది. వెనక ముందులు చూసుకోని ఫాల్గుణ పవనాలలో వైశాఖ పుష్ప ఉన్మత్తతతో, నిర్లక్ష్య హస్తాలతో బీజాల్ని వెదచల్లుతుంది.

రెండో ఆమె, స్వర్గాధిష్ఠాత్రి. మాతృమూర్తి, స్వర్ణ శరత్ పూర్ణత్వ పీఠాన్నధిష్ఠించింది ఆమె. పూర్తిగా పంటలు పండిన కాలంలో చెదిరిన హృదయాల్ని కన్నీళ్ళవలె మధురమైన చిరునవ్వుల దగ్గరకు తీసుకొస్తుంది. నీరవ పారావారమంత లోతైన సౌందర్యాన్ని జీవన మృత్యు పవిత్ర సంగమం వద్ద మానసాగోచర దేవతాలయానికి చేరుస్తుంది.

మధ్యాహ్నపు గాలి, తూనీగ ఉల్లి పొర రెక్కల మల్లే కంపించింది. ఇళ్ళ కప్పులు మగతలోపడ్డ గృహాల పైన గూటిలో పక్షులమల్లె మెదలకుండా వున్నాయి. కిసలయ ఏకాంతం నించి ఓ కోయిల కనపడకుండా పాడుతోంది. గుంపు కూడిన మనుషుల సారంలేని శ్రమపైన దాని నవ్యనిర్మల స్వరాలు వర్షిస్తున్నాయి. ప్రియుల రహస్య గుసగుసల పైనా, తల్లి ముద్దులపైన గాన రసాన్ని కురిపిస్తున్నాయి.

ప్రతి నిమిషం, గులక రాళ్ళని గుండ్రంగా, అందంగా అరగతీసే ఏటిమల్లే, మన ఆలోచనలపైన కోయిల స్వరాలు ప్రవహిస్తాయి.

56. ఆ సాయంత్రం వొంటరిగా ఉంది నేనో పుస్తకం చదువుతున్నాను. నా గుండె ఎండిపోయింది. పదాలతో వ్యాపారం చేసేవారు కల్పించినది ఈ సౌందర్య మనిపించింది నాకు. విసిగిపోయి నేను పుస్తకం మూసేసి మైనపొత్తిని ఆర్పేశాను.

నిమిషంలో గది వెన్నెలతో నిండి పోయింది.

సౌందర్యమా, ఆకాశాన్ని పొర్లేట్టు నింపిన నువ్వు- మైనపొత్తి చిన్న వెలుగు వెనక ఎట్లా దాక్కుని నించోగలిగావు?

పుస్తకంలోని అర్థంలేని కాసిని మాటలు, పొగమంచు మల్లే పైకిలేచి, ఎవరి కంఠం వసుధ హృదయాన్ని చెదరని నీరవంలోకి ముంచిందో; ఆమెకి ఎట్లా ముసుకు వేయగలిగాయి?

57. ఈ శరత్రుతువునాడి. ఎందుకంటే, ఆమె నా హృదయంలో ఉయ్యాలలూగింది. ఆమె అందెల మెరుపు గజ్జలు నారక్తంలో ధ్వనించాయి. ఆమె పల్చనిమేలి ముసుగు నా శ్వాసలో రెపరెపలాడింది. ఎగురుతున్న ఆమె

జుట్టుని నేను నా కలలన్నిటిలోనూ ఎరుగుదును. నా జీవన నాడుల్లో నాట్యమాడే కంపితపత్రాలలో విహరిస్తోంది ఆమె. నీలాకాశాన్నించి చిరునవ్వే ఆమెకళ్ళు నానించి వెలుగుని తాగాయి.

58. ఆకాశంలో సమస్తమూ గుమికూడి, ఖిగ్గరగా నవ్వుతాయి. ఇసికా, దుమ్మూ పిల్లలమల్లే గిరగిరా తిరుగుతో, నాట్యమాడతాయి. వాటి అరుపులతో మనిషి మనసు మేలుకుంటుంది. వాటితో కలిసి ఆడుకోవాలని కోర్కె పడతాయి అతని ఆలోచనలు.

అవ్యక్త ప్రవాహాలతో తేలిపోయిన మన కలలు వసుధని కావిలించుకోవాలని చేతులు జాస్తాయి. వాటి యత్నాలు రాళ్ళుగా, ఇటికలుగా బిగుసుకుంటాయి. ఆ రీతిగా మానవుడి పట్టణం ఏర్పడుతుంది.

గడిచిపోయిన కాలం నించి కంఠాలు గుంపులుగా వొచ్చి పడతాయి. సజీవ వర్తమాన క్షణాలనించి అర్థాన్ని వెతుకుతో. వాటి రెక్కల చప్పుడు కంపించే నీడలతో గాలిని నింపుతాయి. మన మనసులోని నిద్రనెరుగని ఆలోచనలు ఉధృత వాంఛతో వాటి గూళ్ళని వొదిలి రూపధారణ కోసం మసక ఎడారి మీదుగా బైలుదేరతాయి. అన్నిట్లోనూ తమని తెలుసుకోడానికి కాంతి తీరాన్ని వెదికే, దీపం లేని యాత్రికులు అవి. కవుల గీతాల్లోకి పాకుతాయి అవి. ఇంకా నిర్మితంకాని నగర గోపురాలలో గృహమేర్పరుచుకుంటాయి. భవిష్యత్ యుద్ధ భూముల నించి పిలుపు

వొస్తుంది వాటికి. రాబోయే శాంతి సమతాలలో చేతులు కలప
ని వాటికి ఆజ్ఞలు వొస్తాయి.

59. నేను కనుక్కున్న దేశంలో ఎత్త
యిన గోపురాలు కట్టరు. పచ్చిక బయలు పక్కనే బాట
దెడుతో ఉంటుంది. దాని పక్కన, తప్పించుకుని వొచ్చిన
దీతో ప్రవహించే ఏరు. దాని పక్క అందంగా విచ్చు
కున్న పువ్వులు అల్లుకున్న కుటీరాల ముందు, తేనెటీగలు
ఝూగుతో ఉంటాయి. మొగవాళ్ళు చిరునవ్వుతో వారి పనుల
మీద బైలుదేరతారు. సాయంత్రమప్పుడు ఏ భత్యమూ
సంపాయించకండానే పాడుతో ఇళ్ళకి చేరుకుంటారు. మధ్యా
హ్నమప్పుడు, వారి చల్లని ముంగిళ్ళలో స్త్రీలు రాట్నం
ముందు కూచుని కూనిరాగాలు తీస్తో ఒడుగుతారు. గాలికి
వూగే పంట మీదుగా, గొల్లవాడి పిల్లంగోవి నించి గానం తేలి
వస్తుంది; నేను తెలుసుకున్న దేశంలో. పరిమిళ భరితమయిన
అడవులు, పన్నవెలుగుల నీడలగుండా పాడుతో పోయే
బాటసారుల హృదయాల్ని అది రంజింప చేస్తో ఉంటుంది.

పడవల్లో సరుకుల్ని వేసుకుని
వ్యాపారస్తులు నదిలో పయనిస్తారు. కాని ఈ దేశంలో వారి
పడవల్ని కట్టెయ్యరు. పతకాలు ఎగర వేసుకుంటో సైనికులు
తోతో వుంటారు; కాని రాజు మాత్రం తన రథాన్ని దిగడు.
ఇక్కడ కాస్త సేద తీర్చుకోడానికి దూరం నించి ఒచ్చే
పయాణీకులు ఈ దేశంలో ఏముందో తెలుసుకోడానికి వెళ్ళి
పోతారు.

ఈ దేశం వీధుల్లో ప్రజాసమూహాలు ఒకరినొకరు తోసుకోరు కవీ, నువ్వు ఈ దేశంలో నివాస మేర్పరుచుకో. నువ్వు తిరిగిన దూర భూముల ధూళిని నీ పాదాల మీద నించి కడిగేసుకో. నీ వీణకి శ్రుతి పెట్టుకుని, దినమంతం కాగానే, చల్లని పచ్చిక మీద, శుక్ర కాంతి కింద హాయిగా పడుకో.

60. రాజసచివా, మీరిచ్చిన నాణాలు మీరు తీసుకోండి. స్త్రీ నెన్నడూ చూడని బాలరుషిని మరిగించి వశపరుచుకోమని అరణ్యాశ్రమానికి మీరు పంపిన వనితలలో ఒకర్తెను. మీరు నియమించిన కార్యాన్ని నేను నెరవేర్చ లేకపోయినాను.

నదిలో స్నానానికి రుషిబాలుడు వొచ్చినప్పుడు ఇంకా మసకగా తెల్లవారుతోనే వుంది. ప్రాతఃకాల జలధర సమూహాల మల్లే అతని ధూమ్ర వర్ణ కుంతలాలు జడలుగా భుజాల పైన వొత్తుగా పడుతున్నాయి. సూర్యకిరణాల వెలుగు రేఖ మల్లే అతని దేహం మెరుస్తోంది. పడవలో కూచుని తెడ్డేసుకుంటో మేము నవ్వాము; పాడాము వెర్రి ఉల్లాసంతో మేము నదిలోకి దూకి అతని చుట్టూ నాట్యమాడాము. దైవాగ్రహారుణిమతో మా వంక తేరిపారి చూస్తో ఆదిత్యుడు ఉదయించాడు నదీ తీరం నించి. కళ్ళు తెరిచి బాల దేవతామూర్తి మల్లే ఆ వటువు మా దేహ భంగిమల్ని గమనిస్తున్నాడు. అతనిలో విభ్రమం అధికమై కళ్ళు ప్రభాతపు నక్షత్రాల వలె మెరిశాయి. అతను నమస్కరిస్తో చేతులెత్తి పక్షిరుతం వంటి కంఠ స్వరంతో స్తుతి శ్లోకం

చదివాడు. అరణ్యంలోని ప్రతి పత్రమూ పులకరించింది. అంతవరకూ ఏ మర్త్యకామిని నుద్దేశించి అట్లాంటి మాటలు ఏ మానవుడూ పఠించలేదు. నిశ్శబ్దమైన పర్వతాల మీద నించి ఉదయించే ఉషాదేవికి నీరవస్తోత్ర శ్లోకాలవలె విని పించాయి అవి మాకు. తరుణులందరూ చేతులతో నోళ్ళు దాచుకున్నారు. నవ్వుతో వాళ్ళ శరీరాలు వూగిపోయినాయి. అతని ముఖం మీద సందేహం క్రమంగా అలుముకుంది. చాల తీవ్రంగా గాయపడి నేను అతని పక్కకి వేగంగా వెళ్ళాను. అతని పాదాలకి నమస్కరించి "ప్రభూ; నా సేవని అంగీకరించు." అని అతన్ని పచ్చని పచ్చిక తీరానికి తీసుకు వెళ్ళాను నా పట్టు చెరుగుతో అతని వొంటిని తుడి చాను. నేల మీద మోకరిల్లి అతని పాదాల్ని వేళ్ళాడే నా జుట్టుతో తడి వొత్తాను. నా ముఖాన్ని పైకెత్తి అతని కళ్ళ లోకి చూశాను. ఈ సృష్టిలోని ప్రథమ స్త్రీకి ప్రపంచం ఇచ్చిన మొదటి ముద్దుని నేను అనుభవించాననుకున్నాను. నేను ధన్యురాల్ని. నన్ను స్త్రీనిగా సృజించిన ఈశ్వరుడు ధన్యుడు.

"నాకు తెలీని ఏదైవానివి నువ్వు. అమర స్పర్శ నీది. నీ కళ్ళలో అర్ధరాత్రిలోని మర్మం వెలుగుతోంది." అన్నాడు.

"హో, వొద్దు, అట్లాంటి నవ్వు ఒద్దు: రాజసచివా! లోక వ్యవహారాల మురికి దుమ్మూ నీ

చూపుని కమ్మేసింది వృద్ధుడా. కాని ఆ బాలుడి అమాయకత్వం పై పొరను చీల్చి స్త్రీ లోపలి సత్యమేదో ఆ అమరత్వాన్ని తాకింది. ఆ ప్రథమ ఆరాధనా ప్రజ్వలిత ద్యుతిలో నాలోని పరమేశ్వరి ఎంత గాఢంగా మేల్కొందో! నా కళ్ళు నీళ్ళతో నిండాయి. ఉదయ కిరణం నన్ను సోదరి మల్లే లాలించింది. పువ్వుల్ని ముద్దు పెట్టుకున్నట్లే అరణ్య పవనం నన్ను ముద్దు పెట్టుకుంది. నాతో వున్న ఆ వనితలు చప్పట్లు చరిచి; వెకిలి నవ్వులు నవ్వారు. దుమ్ములో పమిటలు జీరాడుతో. విరబోసిన జుట్టుతో అతనిపైన పువ్వుల్ని విసిరారు.

ఏ మలినమెరగనిమార్తాండా!మండే మంచుని నా సిగ్గు తెరగా అల్లి తన మడతలతో నిన్ను కప్పెయ్యలేనా? అతని పాదాల ముందు పడి "నన్ను క్షమించమని" అరిచాను. దెబ్బ తిన్నలేడి మల్లే నీడల్లోంచి ఎండలోంచి పరిగెత్తుతో "నన్ను క్షమించు" అంటూ ఏడ్చాను.

ఫెళ ఫెళమనే అగ్గి మల్లే, ఆ వనితల మురికి నన్ను అదిమేసింది. కాని "నాకు తెలీని ఏ దేవతవి నువ్వు" అనే మాటలు మాత్రం నా చెవుల్లో మోగుతోనే ఉన్నాయి.



## వ్యజిటీవ్

2\. మిత్రమా, మనం యిక్కడికి కలిసి
వొచ్చాము. ఇప్పుడు బాటలు చీలే చోట, నీనించి వీడ్కోలు
తీసుకోడానికి నేను ఆగిపోతున్నాను.

నీ తోవ నీ ముందు విశాలంగా
స్పష్టంగా వుంది. నాకు పిలుపు అజ్ఞాతంనించి వొచ్చేమార్గాల
నున్న చేరుతోంది.

నేను గాలి వెంట మబ్బు వెంట
పోతాను. కొండల వెనక ఉదయమయే చోటికి, నక్షత్రాల
వెంబడి పోతాను.

"నేను ప్రేమిస్తున్నాను." అనే
రాగం మీద దినాల్ని హారంగా అల్లే ప్రియుల వెంట వెడ
తాను.

5\. పిరికి యాత్రికుడా, ఓ పిరికి
జాగ్రత్తని వొదిలేసి పూర్తిగా నీ త్రోవ తప్పి పో.

నువ్వు కళ్ళు తెరిచి మేలుకొని
వున్నా, మసక వలలో పడిన పట్టపగలు మల్లె అయిపో.

తప్పుదారి, చివర కాచుకుని వుండే
తప్పిపోయిన హృదయాలు చేరుకునే వనాన్ని నిరసించి
దూరంగా పోకు. అక్కడ తెగిపోయిన ఎర్ర పువ్వులు
పచ్చిక నిండా పడి వున్నాయి. ఓదార్పు నెరగని నీరు అల
జడి సముద్రంతో పైకి లేచి పడుతోంది.

విసుకు పుట్టించే ఏళ్ళకు ఏళ్ళు కూడపెట్టిన పోతరకి ఎంతకాలమో కావిలి కూచున్నావు. అన్నిటినీ వొదిలేసుకుని నష్టపడే దరిద్రపు విజయం నించి ఏమీ మిగుల్చుకోకుండా ఊడ్చెయ్యి.

8. ఆ ఆకలి కళ్ళతో నా కిటికీ ముందు నుంచిని నా రహస్యం యాచించకు.

అది, రక్తంతో ఎర్రనైన చారలు పడి బాధతో మెరిసే చిన్నరాయి మాత్రమే.

నా ముందు దుమ్ములో విసిరెయ్యి దానికి. ఏ కాన్కలు తీసుకొచ్చావు నీ రెండు చేతుల్లో!

నేను వాటిని అంగీకరిస్తే, నాకు వున్నదంతా వొదులుకున్నా, నీకు అంతులేకండా ఋణపడతానని నా భయం.

నా దరిద్ర జీవితం, సిగ్గుపడేట్టు నీ యవ్వనంతో, పుష్పాలతో, నా కిటికీ ముందు నుంచోకు.

9. కాళిదాసు ఆస్థాన కవిగా వున్నప్పుడు నేను ఉజ్జయినీ రాజధానిలో జీవించి వుంటే, ఓ మాళవ సుందరి పరిచయం చేసుకుని, ఆమె నామ గానంలో నా తలపుల్ని నింపుకునేవాణ్ని. ఆమె కనురెప్పల వంపు తిరిగిన నీడల కింద నించి నా వంక చూసేది. నా సమీపంలో ఆగేందుకు మిషగా ఆమె చెరుగుని మల్లెహొదలో చిక్కుకునేట్టు చేసేది.

పూర్వకాలం ఎన్నడో ఇదే సంఘ
టన జరిగింది. కాలపు శుష్క పత్రాల కింద దాని పద
చిహ్నాలు మాయమైనాయి. దాగుడు మూతలాడే తారీఖు
కోసం, ఈనాడు పండితులు తగూలాడతారు.

జరిగిపోయిన, మాయమైనకాలాన్ని
కలలు కంటో నా హృదయాన్ని బద్ధలుచేసుకోను ఈనాడు.
కాని ఎంత విచారమో! ఆ మాయమైన కాలాలతో పాటు ఆ
మాళవ లలనలు దానివెంట వెళ్ళిపోయినారు గద!

రాజకవి గీత మధుర ధ్వనులతో
గలగలలాడిన ఆ రోజుల పువ్వుల గంపల్ని ఏ అమర ధామా
లకి వాళ్ళు తీసుకు పోయినారోనని నేను ఆశ్చర్యపడతాను.

ఎవర్ని కలుసుకోవడానికి పిలు
లేకండా ఇంత ఆలిస్యంగా పుట్టానో వారి నించి ఎడబాటు,
ఈ ఉదయం నా హృదయంలో బరువుగా నిండి నన్ను
దుఃఖితుణ్ని చేస్తోంది.

అయినా, ఈనాడు వారు తమ
శిరోజాల్ని అలంకరించుకున్న ఆ పువ్వులే ఈ చైత్రం
మళ్ళీ తీసుకొచ్చింది. వారి మేలి ముసుగుల్ని రెపరెప లాడిం
చిన దక్షిణ మారుతమే ఈ నాటి గులాబి పూలకి రహస్యాలు
పలుకుతోంది.

ఈనాడు కాళిదాసు పాడకపోయినా
నిజం చెప్పాలంటే, ఈ వసంత కాలంలో కూడా ఆనందాలు
లేకపోలేదు. దేవతా లోకంలో తన కవి పీఠంనించి నన్ను

కనిపెట్టి చూడగలిగితే ఈర్ష్య పడడానికి కాళిదాసుకి కారణాలు లేకపోలేదని నాకు తెలుసు.

10. ఆమె హృదయం సంగతి నీకెందుకు పోనియ్యి. నా హృదయమా, దాన్ని చీకట్లో వొదిలెయ్యి.

ఆమె అందం వృత్త ఆకారానిది మాత్రమైతేనేం? ఆమె చిరునవ్వు ముఖానిది మాత్ర మైతేనేం? ఆమె చూపుల అర్థం మాత్రమే తీసుకుని సంతోషిస్తాను ఆమె చేతులు నా చుట్టూ పెనవేసుకోవడం మాయా కల్పిత ఇంద్రజాలమైనా, నేను లక్ష్యం చెయ్యను. ఎందుకంటె ఆ మాయ దుర్లభం, అమూల్యం. దాంట్లోని మోసాన్ని తెలుసుకుని, చిరునవ్వు మరిచి పోతాను.

ఆమె హృదయం సంగతి వొదిలెయ్యి. హృదయమా, గానం వాస్తవమైతే అంతటితో తృప్తిపడు. మాటలు నమ్మరాని వైతేనేం, మాయచుచ్చే తరంగాలపై నాట్యమాడే కలవ పువ్వువంటి లావణ్యాన్ని అనుభవించు, దాని కింద ఏముంటేనేం గాక!

11. ఊర్వశీ, నువ్వు తల్లివి కావు, పుత్రికవి కావు, వధువువీ కావు.

అమరలోక వాసుల్ని చకితుల్ని చేసే సమ్మోహన మూర్తినీవు.

పశువులు మందలకు తిరిగి వొచ్చినప్పుడు, అలిసిన పాదాలతో సంధ్య భూమిని కావిలించుకున్న సమయాన, నువ్వు ఇంట్లో దీపాల్ని వెలిగించే గృహి

ణివి కావు. తత్తరపడే హృదయంతో, నీ పెదవులపైప చలించే చిరునవ్వుతో, సంభ్రమంతో, మధురమైన చీకటి గడియలకోసం, ఎదురుచూస్తో నువ్వు ఏ పరిణయ తల్పాన్ని చేరపోవు.

ఊర్వశీ, ఉషాదేవికి మల్లేనే నీకూ ముసుకు లేదు, బెరుకు లేదు.

ఏ దుర్భరమైన వేదన నిన్ను సృష్టించిందో, ఎవరు ఊహించగలరు?

ఒక చేత్తో జీవన పాత్రనీ, రెండో చేత్తో విష పాత్రనీ ధరించి మొదటి వసంత ప్రథమ దివ సాన నువ్వు మధనితవార్ధి నించి పైకి లేచావు. మంత్ర ముగ్ధుడైన శేషుడి వలె మత్తెక్కి భయంకర పారావారం తన వెయ్యి పడగల్నీ నీ పాదాల ముందు వుంచి పడుకుంది.

నీ నిర్మల భాసమాన ద్యుతి మల్లె పువ్వు వలె ధవళంగా, నగ్నంగా సముద్ర ఫెనంలోంచి పైకి లేచింది.

నువ్వు మొగ్గగా, పసిగా, బెరుకుగా వుండే కాలం వుండేదా: అంతరహిత జవ్వనీ !

నీ వికసిత భయంకర పూర్ణత్వాన్ని పగటి వెలుగు బహిర్గతం చేసిందాకా, పగడాల మీదా ముత్యపు చిప్పల మీదా స్వప్నాకృతితో కదిలే ప్రాణులపై మణుల వింత కాంతి నృత్యమాడే చోట, గాఢ నీల విభావరీ డోలికలో నిద్రించావా?

అన్ని యుగాల్లో పురుషులందరూ నిన్ను ఆరాధించారు, నిరంతర విభ్రమ విలాసినీ!

నీ కడగంటి చూపుతో, యవ్వన వేదనలో, లోకం స్పందిస్తోంది. నీ పాదాలముందు తన తపః ఫలాన్ని అర్పిస్తాడు పరివ్రాజకుడు. నీ పరిమళ సమీరం చుట్టూ కవుల గానాలు మూగుతాయి. నీ పాదాలు నిర్లక్ష్యంగా హర్షంతో తేలిపోతే, పైడి మువ్వల రవళులతో, పవనుడి హృదయాన్ని గాయం చేస్తాయి.

నూతన లయా వృత్తాన్ని ఆకాశంలోకి విసురుతో నువ్వు దేవతలముందు నృత్యం చేసినప్పుడు, ఊర్వశీ పృథ్వి కంపిస్తుంది. పత్ర తృణ శరత్ సస్యాలు పూపిరితో నిండి పూగుతాయి. యతి ప్రాస బద్ధమైన ఉత్తుంగ తరంగ సంక్షోభంతో పొంగుతుంది సముద్రం నక్షత్రాలు ఆకాశంలోకి దూకుతాయి—

— నీ వక్షంపై లేచి పడే హారం తెగి రాలిన మణులే ఆ నక్షత్రాలు. పురుషుల హృదయాల్లోని రక్తం అల్లకల్లోలమై నృత్యం చేస్తుంది.

స్వర్గ నిద్ర శిఖరాల నువ్వు ప్రథమ చలనానివి.

ఊర్వశీ ! నువ్వు పవనాల్ని అశాంతితో పులకరింప చేస్తావు.

తన అశ్రువులతో ప్రపంచం, నీ నిర్మలాంగాన్ని స్నాతకం చేస్తుంది.

ధరణి హృదయ రుధిర రక్తిమతో నీ పాదాలు ఎర్రనైనాయి. వాంఛా వీచికా డోలాయమాన పద్మంపైన నువ్వు వొయ్యారంగా నుంచుని వుంటావు. ఊర్వశీ, ఈశ్వరుడి కల్లోల స్వప్నం ఏ అంతులేని మనో సీమలో ఆరాట పడుతుందో అక్కడ నువ్వు నిరంతరం, వినోదిస్తావు.

13. నువ్వు నా ప్రేమని కోరావు. కాని నీకు నా మీద ప్రేమ లేదు. అందుకని నా జీవితం నిన్ను పట్టుకుని వేళ్ళాడుతోంది. నువ్వు తప్పించుకోవాలని పెనుగులాడిన కొద్దీ ఆ గొలుసు కొక్కాలు కర్కశమౌతున్నాయి.

నా నిరాశ నీకు భయంకరమైన సహచారిగా తయారయింది. నీ నించి వొచ్చే అల్పమైన వరాలని గట్టిగా పట్టుకుని నిన్ను అశ్రు గుహాంతరాళంలోకి గుంజుతోంది.

నా స్వేచ్ఛని నువ్వు ధ్వంసం చేశావు. పగిలిన దాని ముక్కలతో నీ కారాగారాన్ని నిర్మించుకున్నావు.

18. సాయంకాలం నన్ను పిలుస్తోంది. అంధకారాన్ని దాటడానికి, నీటి పోటుతో, చివరి బల్ల కట్టులో వెళ్ళే వారి వెంట పోవాలనిపిస్తోంది.

ఇళ్ళకి వెళ్ళే వారు కొందరు. దూరపు తీరాలకి పోయేవారు కొందరు. అందరూ నీటిమీద ధైర్యంగా ప్రయాణమైన వారే.

నా ఇంటిని వొదిలాను. పడవ తప్పిపోయింది. రేవు దగ్గిర వొంటరిగా కూచున్నాను.

వేసవి గడిచి పోయింది. నా చలి కాలపు పంట నాశనమయింది.

కొత్తగా పగలు ఉదయించినప్పుడు వాటిని పరిపూర్ణులను చేసేందుకై, పరాజితుల్ని పోగుచేసి, అంధకారంలో, అశ్రువుల్లో నాకై ప్రేమ కోసం నేను కాచుకుని వున్నాను.

★

# ఫ్యుజిటివ్

## రెండవ భాగము

వివిధ పుణ్యాల మహత్తర మహిమా పతీ! విరివిగా విచ్చుకుపడే ప్రపంచంలో నువ్వు అంతరహిత వివిధ రూపాన్నితవై విలసిల్లుతున్నావు.

నీ తోవ అంతా వెలుగులతో మెరుస్తోంది. నీ స్పర్శ పుష్పాల కింద పులకరిస్తోంది. జీరాడే నక్షత్రాల మధ్య సుడిగుండాల నృత్యాల్ని రేపుతోంది. రంగురంగులుగా ఎన్నో స్వరాల గానం సంఖ్యాతీత ప్రపంచాల నించి ప్రతిధ్వనిస్తోంది.

వొంటిగా, ఏకాంతంగా, ఒక్కదానివీ, అంత తెలీని ఆత్మ లోతుల్లో శాంతంగా వుంటావు నువ్వు. నీరవ, ఏకాంత తేజోమయీ! దీప్తి స్పందిత రూపిణీ! ప్రణయ శాఖాంత వికసిత మృణాళినీ!

9. చాలా దూరాన ప్రపంచాలకాంతిలో నడుస్తో, మనం ఎన్నడైన ముందు జన్మలో కలుసుకుంటే, నేను అదిరిపడి ఆగిపోతాననుకుంటాను.

ఆనాటి ప్రాతక్కాల నక్షత్రాలేనని నేను నీ కళ్ళని గుర్తించి, జ్ఞాపకం లేని పూర్వ జీవితపు సంధ్యాకాశ తారలని తెలుసుకుంటాను.

నీ ముఖంలోని ఇంద్రజాలమంతా దానిదే కాదనీ, జ్ఞాపకానికి అందని మన కలయిలో నా కళ్ళలో నివసించిన ఉధృత కాంతిని దొంగిలించి, తన జన్మని మరచి నా ప్రేమ నించి మర్మాన్ని తీసుకున్నాయనీ తెలుస్తుంది.

10. ప్రియా! నీ వీణని కింద పెట్టినన్ను కావిలించుకోవడానికి నీ చేతులకి స్వేచ్ఛ నియ్యి.

నీ స్పర్శని దేహాంచలాలకి పొంగి పొర్లే నా హృదయానికి తీసుకు రానీ.

నీ మెడని వొంచి నీ ముఖాన్ని తిప్పుకోకు. చాలాకాలం మొగ్గలో బంధించిన పరిమళం వంటి నీ ముద్దుని నాకియ్యి.

అనవసరమైన మాటలతో ఈ నిమిషానికి ఊపిరి సలపకండా చెయ్యకు. తీరంలేని హర్షంలో మన ఆలోచనల నన్నిటినీ పూడ్చేస్తో, మౌన ప్రవాహంలో మన హృదయాన్ని స్పందించనీ.

11. ఈ ప్రపంచ ప్రవాహంలో కొట్టుకుపోతూ, దాని అనిత్య కటాక్ష వీక్షణాల మధ్య పూగే అసంఖ్యాకుల్లో వొకణ్ని అయినా, నువ్వు నన్ను నీ ప్రేమతో ప్రముఖుణ్ని చేశావు.

ఏ కాలం వారైనా కవులు తమ కవితా నైవేద్యాల్ని ఎక్కడ అర్పిస్తారో, అమర ప్రేమికులు యుగయుగాలు ఒకరినొకరు ఏ పేర్లతో గుర్తిస్తారో అక్కడ నాకో స్థానాన్నిచ్చావు.

నా దేహం నీ లాలింపులతో ఎట్లా అమూల్యమయిందో గమనించక సంత వీధుల్లో ప్రజలు నన్ను రాసుకుపోతో వుంటారు. తన బింబంలో దేవతాగ్నిని ధరిస్తో ఆదిత్యుడు ఎట్లా దేదీప్యమానంగా వెలుగుతాడో అట్లా నేను నీ ముద్దుల్ని నా హృదయంలో దాచుకుని ఎట్లా తేజోవంతుడనౌతున్నానో ప్రజలు గమనించారు.

19. మేము మొదట కలుసుకున్నప్పుడు గానంతో ధ్వనించింది నా హృదయం: "అనంతంగా దూర మైన ఆమె ఎప్పటికీ నీ పక్కనే ఉంది" అని.

ఆ గానం ఆగిపోయింది. ఎందు కంటే, నా ప్రియాంగన దగ్గరగానే వున్నదనే నమ్మకంలోకి నేను దిగడంవల్ల!. ఆమె దూరాన ఎంతో దూరాన కూడా వున్నదని మరిచి పోవడంవల్ల.

రెండు ఆత్మల మధ్య వుండే అనంతత్వాన్ని గానం నింపుతోంది. మన దైనిక చర్యల మసక మూలాన దానికి ముసుకు పడ్డది. బెరుకుగా తొంగి చూసే ఎండాకాలపు రాత్రులలోని నీరవంలోంచి మృదు సమీకం గట్టి రహస్యాన్ని పైకి తీసుకు వొచ్చినప్పుడు నా

పక్కమీద కూచుని. నా పక్కనే పడుకున్న ఆమెను పోగొట్టుకున్నానని దుఃఖిస్తాను.

శాశ్వతత్వపు లయలో మేళవించే వాక్కుల్ని తిరిగి ఆమె చెవులో పలకగల సమయం తిరిగి నాకెప్పుడు కలుగుతుందా అని వ్యాకులపడతాను.

నా గీతమా! నీ బద్ధకం నించి మేలుకో! మామూలుతనపు తెరను దించుకో. అక్కడ దూరంగా వున్న ప్రియురాలి దగ్గరికి ఎగిరి వెళ్ళు. మొదటి సందర్శనపు తీరని ఆశ్చర్యంలోకి వెళ్ళు.



# వ్యజిటీవ్

## మూడవ భాగము

4. సాయంత్రాలప్పుడు పశువుల్ని ఇళ్ళకి తోలుకు వొచ్చిం తరవాత, వాళ్ళ కుటీరాల ముందు గడ్డిలో కూచుంటారు. కనపడకండా నువ్వు వాళ్ళ మధ్య వున్నావని తెలుసు. ప్రేమతో వాళ్ళు నీకిచ్చిన పేరుని వాళ్ళ పాటల్లో తిరిగి తిరిగి పలుకుతారు.

రాజుల కిరీటాలు ప్రకాశించి క్రింద పడిన నక్షత్రాలమల్లే రాలిపోతాయి. కాని పల్లె కుటీరాల మధ్య నిశ్శబ్దమైన చీకట్లో కూచుని నిన్ను ప్రేమించే హృదయాల నించి నీ పేరు గానమౌతో వుంటుంది. వాళ్ళ పేరు ఎక్కడా లిఖితం కాలేదు.

7 రమ్మనే నీలాకాశం పిలుపుకి తన జండానెత్తే ఆకుపచ్చని గడ్డి పరక సంతోషాన్ని పంచు కోవాలని ధరణి! ఎన్నిసార్లు నీ చుట్టూ నా ప్రాణం అల్లు కుందో!

నేను పుట్టకముందుయుగాలకింద కే నీవాణ్ని అయినట్టు తోచింది.

అందుకనే, పంటకి వొచ్చే వరి కంకులమీద శరత్కాంతి నిగనిగలాడేటప్పుడు గడచిన కాలం నాకు జ్ఞాపకం వొస్తో వుంటుంది. అప్పుడు నా

మనసు సర్వత్రా వ్యాపించి వుండేది. గట్టిగా మునుకుపడ్డ దూర కాలం నించి ప్రతిధ్వనించే చెలికాళ్ళ కంఠాలు వింటున్నట్టు అనిపిస్తుంది. సాయంత్రమప్పుడు, పచ్చిక బయలు లోపల దుమ్ము రేపుతో పశువులు మందలకు చేరుకు నేప్పుడు గ్రామ కుటీరాల నించి లేచే పొగరన్న ఎత్తుగా చంద్రుడు ఉదయిస్తోవుండగా, జీవిత ప్రథమ ఉదయాన సంభవించిన గొప్ప వియోగంతో విచారగ్రస్తుణ్ని అవుతాను.

8. ఆ రోజు నేను చేసిన పనులు నా మనసులో ఇంకా రొద పెడుతోనే వున్నాయి: సంధ్యా కాంతి ఎట్లా చీకట్లోకి దిగుతోందో గమనించకండా చూచు న్నాను. తటాలున చీకటి మీదుగా కాంతి కదిలి ఓ చేతి వేలు మళ్లి నన్ను తాకింది.

నా తల ఎత్తాను. చిన్నపిల్ల చూపు మల్లే, ఆశ్చర్యంతో విప్పార చూసే చంద్రుడి దృష్టి చాలా సేపు నా కళ్ళని కట్టేసింది. నా కిటికి పక్కగా ఓ ప్రేమ లేఖ నా ముందు పడ్డట్టు అనిపించింది.

పేరులేని నక్షత్రాలుగా ఆమె ప్రేమ ప్రకటనవలె అంత గొప్పగా రాత్రివేళ కనపడని పువ్వుల మల్లె, పరిమళ వంతమైనదేదో ఒక ప్రత్యుత్తరం రాయాలని, ఆనాటినించి నా హృదయం పెనుగులాడుతోంది.

24. సాలె కబీరు, ఈశ్వరానుగ్రహాన్ని పొందిన మనిషి అని, మనుషులు మందులకోసం, మహాత్మ్యాల కోసం అతని చుట్టూ మూగేవారు. అతనికి మాత్రం అది బాగా లేదు. అతని తక్కువ కులం అతన్ని ఇన్నాళ్ళూ

హాయైన అగౌరవంతో అతన్ని రక్షించింది. తన వొంటరి తనాన్ని మధురమైన పాటలతో, ఈశ్వర సాన్నిధ్యంతో నింపుకునేవాడు. తిరిగి తాను ప్రజల ఏవగింపులో మరుగు పడాలని ప్రార్థించాడు దైవాన్ని. కులహీనుడైన ఈ మనిషి కీర్తికి ఈర్ష్యపడి, మత పెద్దలు అతని దగ్గిరికి ఒక వేశ్యను పంపారు, అతన్ని అవమానించాలనే వుద్దేశ్యంతో.

తను నేసిన బట్టల్ని అమ్ముకోడానికి అంగడి వీధికి వొచ్చాడు కబీరు. ఆ వేశ్య అతని చేతిని పట్టుకుని "నన్నెందుకు వొదిలేశా"వని అతన్ని నిందించడం మొదలు పెట్టి అతని ఇంటికి వెంట వెళ్ళింది తనని అట్లా వొదిలెయ్యడానికి వీలులేదంటో. "ఆయన తన ప్రకారమే మన వాంఛల్ని తీరుస్తాడు ఈశ్వరుడు" అని కబీరు తనలో తాను అనుకున్నాడు.

త్వరలోనే ఆ స్త్రీ భయకంపితఐ, అతని ముందు మోకరించి "నన్ను నా పాతకం నించి రక్షించు" అంది.

"నీ జీవితాన్ని ప్రభువు కాంతికి తెరు" అన్నాడు కబీరు.

కబీరు మగ్గం నేస్తో ఎప్పటి మల్లేనే పాడుకుంటున్నాడు. ఆ పాటలు ఆమె హృదయం నించి మాలిన్యాల్ని కడిగివేసి ఆమె మధురమైన కంఠంలో స్థాన మేర్పరుచుకున్నాయి.

ఓ రోజు, రాజు వినోదార్థంగా కబీర్ని వొచ్చి తన ముందు పాడమని ఆజ్ఞాపించాడు. ఆ స్సాలె

అతను రానని తల వూయించాడు. కాని రాజదూత, పని కాకుండా రాజు దగ్గిరికి వెళ్ళడానికి జంకాడు.

రాజసభ ప్రవేశించిన కబీరుని చూసి, రాజూ, సభికులూ తెల్లబోయినారు. ఎందుకంటె, అతను వొంటరిగా రాలేదు. అతని వెంట ఆ స్త్రీ కూడా వుంది. కొంత మంది చిరునవ్వారు. కొందరు బొమలు ముడిచారు. కాని రాజు ఆ ముష్టివాడి సిగ్గులేని తెంపరితనానికి ఆగ్రహించాడు.

కబీరు తన ఇల్లు చేరుకున్నాడు, పరువు పోగొట్టుకొని. ఆ స్త్రీ అతని పాదాల ముందుపడి:

"నా కోసం నువ్వు ఎందుకు అంత అగౌరవపడ్డావు. ప్రభూ నన్ను నా మురికి బతుకులోకి పోని య్యండి" అంది.

"అవమానితుడై వొచ్చారని ఈశ్వరుణ్ని నా నించి పొమ్మనగలనా?" అన్నాడు కబీరు.

27. నదీ, సరోవరమూ కలిసే చోట అడివిలో కొంతమంది అప్సరసలు మారువేషంలో నివసిస్తు న్నారని చెప్పుకునేవారు. వాళ్ళు మాయమైన తరవాతగాని, వారు అప్సరసలని తెలిసింది కాదు.

ఓ రాకుమారుడు ఆ అడివిలో నదీ, సరసూ కలిసే చోటికి వెళ్ళాడు. వొడ్డున కలవలు నృత్య మాడేట్టు తన కాళ్ళని ఆడిస్తో కూచున్న ఒక పల్లె పడుచుని చూశాడు.

"నాకు చెప్పు,నువ్వు ఏ దేవతవి?" అని ఆమెని అడిగాడు.

ఆ ప్రశ్నని విని ఆ కన్యనవ్వింది. ఆమె ఉల్లాసానికి కొండలు ప్రతిధ్వనించాయి.

ఆమె జలపాత హర్ష దేవకన్య అనుకున్నాడు అతను.

తన కుమారుడు ఓ అప్సరసను పెళ్ళి చేసుకున్నాడన్న వార్త రాజుకి తెలిసింది. గుర్రాల్నీ, నౌకర్లనీ పంపివాళ్ళని ఇంటికి పిలిపించుకున్నాడు.

రాణి వధువుని చూసి అసహ్యంతో తల తిప్పుకుంది. సిగ్గుతో రాకుమారి ముఖం ఎర్రబారింది. అప్సరసలు బట్టలు వేసుకునేది ఇట్లానేనా? అని అడిగారు దాసీ జనం.

రాకుమారుడు నెమ్మదిగాఅన్నాడు, "మాట్లాడకండి; నా అప్సరస మారువేషంలో వొచ్చింది, మన ఇంటికి" అని.

వార్షికోత్సవం నాడు రాణి కొడుకుతో "మన రాజ బంధువులంతా ఇంటి కోడల్ని చూడ వొస్తున్నారు. వారి అందరి ముందూ మనకి తలవంపులు తేవొద్దని చెప్పు, నీ భార్యతో" అంది.

తన వధువుతో రాకుమారుడు "నా ప్రేమ కోసమైనా, నా బంధువులకి నీ నిజ స్వరూపం చూపించు" అన్నాడు. ఆ మాట విని ఆమె చాలాసేపు మౌనంగా కూచుంది. చివరికి ఆమె తన అంగీకారాన్ని సూచిస్తో తల వూయించింది. ఆమె చెంపల మీదనించి కన్నీళ్ల కారుతున్నాయి.

నిండు చంద్రుడు ఆకాశాన వెలుగు

తున్నాడు. రాకుమారుడు పెళ్ళి బట్టలతో ముస్తాబై, పెళ్ళి కూతురు గదిలోకి వెళ్ళాడు.

ఆ గదిలో ఎవరూ లేరు. కిటికీలోంచి వెన్నెల రేఖ ఖాళీ పర్యంకానికి అడ్డంగా పరుచుకుని వుంది.

రాజ దంపతులతో రాజబంధువు లందరూ, తోసుకుంటో ప్రవేశించారు గదిలోకి. రాకుమారుడు గది గుమ్మం దగ్గిర నుంచుని వున్నాడు.

అందరూ అడిగారు "ఏది, అప్సర వధువు" అని.

"తానెవరో మీకు తెలపాలని ఇంక కనపడకుండా మాయమయింది" అన్నాడు వరుడు.

33. ఈ అంబర అగాధ శాంతిని అనుభ విస్తున్నాయి నా కళ్లు.

సూర్య కాంతితో నింపుకోడానికి పాత్రం వలె తన పత్రాల్ని పైకెత్తి పట్టుకునే వృక్షానుభూతి నాలో మెదులుతోంది.

పచ్చిక మీద నించి, ఎండలో పైకి లేచే వెచ్చని విశ్వాసం మల్లే నా మనసులో ఒక ఆలోచన పైకి లేస్తోంది. కొట్టుకునే నీటి గలగలతోనూ, పల్లె బాటల్లోని అలిసిన మారుతపు నిట్టూర్పులతోనూ మిళిత మౌతుంది— ఈ ప్రపంచ జీవిత సంపూర్ణత్వంతో కలిసి జీవించానని, నా ప్రేమనూ, విచారాన్నీ దానికి ఇచ్చాననే ఆలోచన నాకు తృప్తినిస్తుంది.

★

# చివరి

# కానుక

ఇది చలం చివరి
ప్రేమ కానుక.
తనను పరవసింప చేసిన
టాగూర్ కవితా సౌందర్యాన్ని
తెలుగు సారస్వత ప్రియులకు
అందివ్వాలనే
ఆశతో, ఆకాంక్షతో
అవాజ్య ప్రేమతో
చేయి కదల్చలేక పోతున్నా
ఆరోగ్యం హతం చేస్తున్నా
క్రిష్ణారావుకి చెప్పి చేయించిన
చలం
చివరి కానుక
ఇది.

మీరు బాధించినా, వేధించినా
వెలి వేసినా బలి చేసినా
ఏం చేసినా
సర్వాన్ని మరిచి, క్షమించి
తన నిర్మల హృదయ విశాలత్వంతో
ఆ కవితా సౌరభాన్ని
సంతసంతో సమర్పిస్తోన్న
చలం
చివరి కానుక
ఇది.



కవిత్వం సౌందర్యం, సౌరభం, విశాలత్వం, దయ చూపడం, తెలిసిన జ్ఞానాన్ని అందరికి అందివ్వాలని తపన పడడం, ఆర్తులని ఆహ్లాద పరచడం, దీనులకి సాయ పడడం—
ఇవన్నీ అనవసరంగా
అర్థరహితంగా అవివేకంగా ఉన్మాదంగా భావించే
ఈ ధూర్త లోకానికిది
చలం చివరి కానుక.
ఈ ధరణీతల సుకుమార శాద్వలాన్ని
అరుణోదయ కాంతిరేఖా విలాసాన్ని
ఆకాశ గాఢ నీలాన్ని

అరుణాచల సౌందర్యాన్ని
మల్లెల మృదు పరిమళాన్ని
మాలతీ మధుర సుగంధాన్ని
మందాకినీ సలిలాన్ని
హేమ బిందు సందోహాన్ని
పక్షుల కిల కిలా రావాన్ని
సుందర నందన వనాన్ని
మయూర నృత్యాన్ని
మధుర మకరంద మందారాల్ని
గొల్ల వాళ్ళ పిల్లంగోవి అల్లరి రాగాల్ని
రావి లేచిగుళ్ళ తళ తళల్ని
శిశు దరహాసాల్ని
దూకుతోన్న జలపాతాల్ని
సెలయేటి గలగలల్ని
కోయిల సోమరి కూని రాగాల్ని
మధుప ఝుంకార నాదాల్ని
అడవి జాజుల పరిమళాల్ని
కొలను గట్టున మెరిసే చిన్న గడ్డి పువ్వుల్ని
ఏటివార ఎండలో మెరిసే ఇసుక తిన్నెల్ని
మలయ మారుతాల్ని
లేపచ్చిక బయళ్ళని

తెల్లగొర్రె మందల్ని
అస్తమయ రాగ రంజిత సంధ్యలోతుల్ని
పున్నమి వెన్నెల చల్లదనాన్ని—
విస్మరించి
ధనం, కీర్తి మర్యాద సాంప్రదాయం
అంధ విశ్వాసాలతో ఉన్మత్తులయిన
మిమ్ము చూసి
భరించలేక వేదనతో
ఆవేదనతో రోదనతో
"లలనా, ఈ లోకమింతే!" అని
హృదయాంతరాళం లోంచి
ఆక్రోశించిన
చలం
చివరి కాన్క
ఇది.
ప్రేమించే వారికి, శ్లాఘించే వారికి
ద్వేషించే వారికి, దూషించే వారికి
అల్పులకి, అధికులకి

సౌందర్యారాధకులకి, అంధులకి
సారస్వతాభిమానులకి
కవులకి, కళాప్రపూర్ణులకి
గాయక సార్వభౌములకి
విమర్శనాగ్రేసరులకి
బాధించే వారికి, బోధించే వారికి
స్కాండల్స్ ప్రచారం చేసే స్కౌండ్రల్స్‌కి
అధికార మదాంధతతో విర్రవీగే
ఉత్తర వీర కుమారులకి
జాతి, మత, కుల భేదాలతో
కుళ్ళి కంపు కొడుతున్న వారికి
సర్వజ్ఞుల మనుకునే సంపాదకులకి
సంసారమే సర్వస్వమనుకునే సర్వమంగళలకి
ఆకాశ రాకాసులకి
ముద్రణా రాక్షసులకి
రచయితల రక్తంతో బతికే పబ్లిషర్స్‌కి
శవ సాహిత్య పఠితలకి
సన్మానాల స్తోత్ర పాఠకులకి

విషవృక్ష లతలకి
మదోన్మత్తులకి
సారస్వతాధి నేతలకి
వికటాట్టహాస నట సామ్రాట్టులకి
వికృత నర్తకులకి
అశ్లీల జనిత మాయా చలన చిత్ర
కళాకారులకి, ఆరాధకులకి
పతితలకి, పురుష వంచిత వనితలకి
నవ నాగరికతా నంగి నారీమణులకి
జ్ఞానానందులకి, రామానందులకి
రమానందులకి, భ్రమానందులకి
యోగానందులకి, భోగానందులకి
దొంగభక్తులకి, దొంగభక్త పరాధీనులకి
భజనపరులకి, మానసోల్లాసులకి
మనో జనిత ఆత్మసాక్షాత్కార వంచకులకి
విధి వంచితులకి
మమ్మీ, డాడీలకి
బేబీ, బాబులకి

అందరికీ

ఇది

చలం చివరి ప్రేమ కానుక.

జీరాడే తన తల్లి చీర కుచ్చెళ్ళు

పట్టుకుని చొంగ కారుస్తో, పారవశ్యంతో

కన్న కమనీయ కలల్ని కాల రాచిన మీకూ—

కవితా సౌందర్య రసాస్వాదనాంధులై

విమర్శ పేరున వెర్రి కేకలేసిన మీకూ...

ఇది చలం

చివరి కానుక.

పక్క మీంచి లేవలేని పసి తనంతో

మీ ఆదరాభిమానాలతో నిరసించి, కలం అలల మహా సౌంద ర్యంలోకి క్రమంగా కరిగి పోతున్న కవితామూర్తి చలం చివరి కానుక ఇది.

ఈ చివరి ప్రేమ కానుకని

మీరు తృణీకరించినా

నిరాకరించినా, నిరసించినా

నిరాదరించినా, నిర్లక్ష్యం చేసినా

నిర్దయగా చూసినా

నిర్లిప్తంగా పూరుకున్నా
చ: అవనీ తలంలో ఏ మూలో
సౌందర్యానికి కన్ను తెరిచి
"కాన్క" కోసం
ఏ కొందరో కలలు కంటున్నారనే
ఆశతో, ఆకాంక్షతో
అనిర్వచనీయానందంతో
"ఇది నా చివరి మాన్యుస్క్రిప్టు
దీన్ని అందంగా అచ్చువేయండి" అని
ఎక్కడో పుట్టి
ఎలాగో పెరిగి
ఇంటా, బయటా
అప్రయోజకులుగా, అసమర్థులుగా
నిస్సహాయులుగా, నిరర్థకులుగా
నిర్ధనులుగా, అవివేకులుగా
అమర కీర్తి నార్జించుకున్న—
ఏ విధి వల్లనో ప్రారబ్ధం వల్లనో
శాపం వల్లనో
ఈశ్వరానుగ్రహం వల్లనో
చలాన్ని చదివి
ఏ శత సహస్రాంశమో అర్థం చేసుకుని

భగవాన్ శ్రీ రమణ మహర్షి
పాదాల ముందు మోకరిల్లిన చలాన్ని
సమీపించి, దగ్గరై సౌందర్యారాధకుడిగా
కవిగా, తాత్వికుడిగా, సత్యాన్వేషిగా
ఆత్మీయుడిగా "నాన్న"గా
భావించి ప్రేమించే, ఆరాధించే
మమ్మల్ని: ఉత్సాహపరిచి
చేయించి ఇస్తోన్న
చలం
చివరి
కానుక
ఇది.
ఇది మీకూ, మాకూ
చివరి కానుక.
ఇది అందరికీ చలం
చివరి
ప్రేమ కానుక.

★

కురంగేశ్వర్
వెంకటేశ్వర్లు
కృష్ణారావు